Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

మంటి కరుగు

పంపినవారు:
ఎస్. విజయలక్ష్మి - ఏలూరు

5

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవిగాక - రంగులబొమ్మ కథ, చిత్రకథ,
ఫోటోశీర్షికల పోటీ - మొదలైన మరిఎన్నో ఆకర్షణలు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఇటీవల చందమామలో ప్రవేశపెట్టిన 'చిత్రకథ' అనే కొత్త శీర్షికనుగురించి ఆమోదం తెలుపుతూ చాలామంది పాఠకులు వ్రాశారు. సంతోషం. ఇదే కాదు, ఇటువంటివే చిత్రకథలు రంగురంగులలో ఆకర్షణీయంగా ప్రచురించాలని మా సంకల్పం. త్వరలోనే దీనిని నెరవేర్చటానికి యత్నిస్తున్నాము. ఈ నెలనుండి 'వార్తలు - విశేషాలు' అనే మరిఒక శీర్షికకూడా ప్రారంభించాము. ఇందుకోసం ఏర్పడిన రెండు పుటలలోనూ పాఠకులు సేకరించి పంపే వార్తలూ, విశేషాలూకూడ చేర్చదలిచాము. కనుక, మీరు ఉత్సాహంతో పాల్గొని ఈ శీర్షికను విజయవంతం చేయాలని కోరుతున్నాము. ఈ వార్తలు ముఖ్యంగా బాలబాలికల అభ్యుదయానికి తోడుపడేవిగా ఉండాలి. వారి అభివృద్ధినీ, మనస్తత్వాన్నీ గుర్తుంచుకొని, వారికి ఉపయోగించే వార్తలనే ఏర్చి కూర్చటంలో పాఠకులు ప్రత్యేకత చూపాలి.

సంపుటి 15 : జూలై 1954 : సంచిక 1





CHITRA




# అలెగ్జాండరు : సింహం

అఖిల క్షోణిని హడలగొట్టినది
ఆ రోజుల్లో అలెగ్జాండరూ!
ఈ రోజుల్లో అటంబాంబూ!
ఆ కథ వింటే ఇది విన్నట్టే.

ఏ మహాకవియొ ఎన్నడొ చెప్పిన
నీతి కట్టుకథ నేటికి నిలిచెను.
అప్పుడు చేసిన హెచ్చరికైనా
ఇప్పుడు విన్నా మంచిదె; వినుడిక:

ఎల్లరి స్వేచ్ఛల కొల్లగొట్టగా
అలెగ్జాండరను అమోఘబలు డొక
డవతరించెనని గోలగోలగా
పుకారు పుట్టెను; వార్తయు వచ్చె:

"మనుషులు, మృగములు,
పక్షులు, పురుగులు
ప్రాణులెల్ల తన ప్రతాపధాటిని
అణకువతో శిరసావహించుటకు
హాజరు కమ్మని" అతని ఆజ్ఞగా.

ఇక చూడండీ ఆ సంచలనం!
దొరికినదేదో దుటుకున మ్రింగుచు
అడిగే నాథుని అదివర కెరుగని
మృగలోకంలో గందరగోళం.

సంశయించుచునె సభ గావించి
జంతువులన్నీ చర్చలు చేసి

(గేయకథ)

తిట్టుకొనుచునే తీర్మానించెను
శరణుయాత్రకే సాగుట మేలని.

నరునికి దగ్గిర వానరుడే యని
కోతిని దూతగ పెట్టుకొని
మనిషికి ముఖ్యము ధనమెకదాయని
మణుల గనులనే త్రవ్వుకొని,
ఏనుగు, ఒంటె, గుఱ్ఱం, గాడిద
ధనసంచయమును మోసుకురాగా
కోతివెనుక పెనుతోక చందమున
బారుగ మృగములు బిరబిర సాగ,
కొండమలుపులో గుహముందర యా
దండును గని గర్జించెను సింహం:

"ఓరి కోతిగా సారె యెటకురా?
సరిసరి యిచ్చట దింపి నడువు"మని.

కోతి కిచకిచల గప్‌చిప్ అనుచు
ఆ నజరానా యట నర్పించి
అలెగ్జాండరుని సన్నిధి కేగి
జరిగినదంతా మొరనిడె; కాని,
ఆ మహామహుడు ఆగ్రహపడి ఆ
మృగములనే మరి దండించెనట!

ఉద్ధవు లాకరొక రెపుడు డీకొనరు
మధ్య పేదలకె మరణసంకటము.








పూర్వం, బ్రహ్మదత్తుడు కాశీనగరాన్ని పరిపాలించే కాలంలో, బోధిసత్త్వుడు ఒక బ్రాహ్మణునికి కుమారుడుగా జన్మించాడు. వీనికి కొంచెం ప్రాజ్ఞత వచ్చేసరికి బ్రాహ్మడికి ఇంకొక కుమారుడు పుట్టాడు.

కొంతకాలానికి తలిదండ్రులు కాలం చేశారు. అందుచేత విరక్తిచెంది, అన్నదమ్ములిద్దరూ—గంగానదికి అవతలఒడ్డున ఒకడూ, ఇవతలఒడ్డున ఒకడూ కుటీరాలు వేసుకొని, సన్యాసులుగా ఉంటున్నారు.

ఒకరోజున, పాతాళలోకంలో ఉండే సర్పరాజు—మణికాంతుడు మనుష్యరూపం తాల్చి భూమిపైకి వచ్చి, గంగానది ఒడ్డునే నడిచిపోతున్నాడు. పోయి పోయి చిన్నవాని కుటీరం కనబడగా, అక్కడికి వెళ్లాడు. ఎంతో అప్యాయంగా మాట్లాడాడు. కొద్దిసేపట్లోనే వారిద్దరూ ఒకరినొకరు విడువలేనంతటి ప్రాణస్నేహితులయ్యారు.

నాటినించీ చిన్నవాడివద్దకు మణికాంతుడు తరచు వచ్చిపోతూ ఉండేవాడు. వారిద్దరూ రోజులకొద్దీ అలానే సరదాగా మాటాడుతూవుండేవారు. అంతేకాదు. మణికాంతుడు యథాస్వరూపం పొంది, చిన్నవాడి తలపైన పడగ పట్టి, కొంతసేపయినతరువాత వెళ్ళివస్తానని చెప్పి, తన లోకానికి పోయేవాడు.

'సర్పరాజు స్నేహం గొప్పదేకాని, వీడిది దుష్టస్వభావం. ఎప్పటికైనా వీడివల్ల ప్రాణాపాయం కలగవచ్చు' అని చిన్నవాడికి మనస్సులో బెంగ పట్టుకొన్నది.

ఈ స్థితిలో—ఒక రోజున వాడు అన్నవద్దకు వెళితే, అతను ఆశ్చర్యపోయి 'ఇదేమిటి తమ్ముడూ, ఇంతగా చిక్కిపోయావేమి? నీ పచ్చటి రంగే మారిపోయిందే!- ఏమిటికారణం?' అంటూ ప్రశ్నింపసాగాడు. ఇందుకు చిన్నవాడు మర్మంలేకుండా



సంగతి సందర్భాలన్నీ అన్నకు చెప్పివేశాడు. అన్న చెప్పినదంతా విని, 'ఐతే తమ్ముడూ! మణికాంతుడు నీవద్దకు రావాలంటావా, వద్దంటావా? ఏదో ఒకటి చెప్పు' అన్నాడు.

'వద్దు' అన్నాడు చిన్నవాడు.

'సరే. ఆ సర్పరాజు నీవద్దకు వచ్చేటప్పుడు ఏమేమి ఆభరణాలు ధరించుకొని వస్తాడు?' అని మళ్ళీ అడిగాడు అన్న.

'ధగధగ మెరిసే మణి ఒకటి' అని చెప్పాడు చిన్నవాడు.

'సరే, బాగుంది. ఈసారి మళ్ళీ నీవద్దకు వచ్చి కూర్చుని అతను ఆప్యాయంగా మాటాడుతున్నప్పుడు ఆ మణి నీకు కావాలని అడుగు. ఏం జరుగుతోందో కనిపెట్టు' అని చెప్పాడు. 'అలాగే' అని చెప్పి చిన్నవాడు తన కుటీరానికి వెళ్లిపోయాడు.

మరునాడు మణికాంతుడు కుటీరం లోపలకు వచ్చాడు. చిన్నవాడు తనకు మణి కావాలని సర్పరాజును అడిగాడు. కూర్చోకుండానే మణికాంతుడు తన లోకానికి మరలిపోయాడు. రెండవ రోజున మళ్ళీ వచ్చాడు మణికాంతుడు. ద్వారంవద్ద నిలబడివుండగానే చిన్నవాడు 'నిన్ననే అడిగాను, మణి ఇచ్చావుకాదుకదా! ఇవాళైనా ఇస్తావా?' అనేసరికి లోపలికి



రాకుండా అక్కడినించే వెనక్కు తిరిగాడు మణికాంతుడు.

మూడవరోజున సర్పరాజు మళ్లీ రావడం కనిపెట్టి, 'ఎన్నిసార్లు అడిగినా మణి ఇచ్చావుకాదుకదా! ఇప్పుడైనా ఇస్తావా?' అని గద్దించి అడిగాడు చిన్నవాడు. సర్పరాజు మరి ముందుకు ఒక్క అడుగైనా వేయలేదు. అక్కడే ఆగి ఇలా అన్నాడు:

'చిన్నవాడా!—ఈ మణి సామాన్యమైనదికాదు. నేను ఏమి కోరితే దానిని ఇచ్చే కామధేనువు, నా కోరికలన్నీ తీర్చే కల్పతరువు. ఇటువంటిదానిని నీవడిగితే నేనెలా ఇవ్వగలను? కనుక నీవద్దకు ఇక






ఈ జన్మలో రానేరాను, నీకు మళ్ళీ కనబడనే కనబడను.' ఈమాటలు అని, మణికాంతుడు అక్కడినుంచి వెళ్లిపోయాడు. మరెన్నడూ చిన్నవాడికి కనబడలేదు.

ఇప్పుడు చిన్నవాడికి మరొక పెద్ద చిక్కు పట్టుకొన్నది. ఇన్నాళ్ళనుంచి ప్రాణస్నేహితుడుగా ఉంటున్న మణికాంతుడు కంటికి కనబడకపోవటంతో ఒక విధమైన కొత్త బెంగ పట్టుకొన్నది. మునుపటికంటె ఇప్పుడు మరీ పాలిపోయాడు. శరీరమంతా అస్థిపంజరంలాగా తయారైంది.

ఇంతలో ఒకనాడు తమ్ముడు యెలా ఉన్నాడో అని అన్న చూడవచ్చాడు. చూచి ఆశ్చర్యపోయి, 'మునుపటికంటె అధ్వాన్నంగా తయారయ్యావే. ఆ సర్పరాజు పీడ వదలలేదా? నేను చెప్పినట్టు చేయలేదా?' అని అడిగాడు.

ఇందుకు చిన్నవాడు 'అన్నా!—నీవు చెప్పినట్టే చేశాను. నాటినుంచీ సర్పరాజు రావటం మానివేశాడు. ఆ మణికాంతుడు వచ్చి నాతో మాటాడి, తలపైన పడగ ఎత్తితే కాని నాకేమీ తోచటంలేదు. అతను నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోవటంతో నాకు వెర్రెత్తినట్టయింది. ఈ బెంగవల్లనే నేను మరింత శుష్కించిపోతున్నాను' అని అన్నాడు.

అప్పుడు అన్నఐన బోధిసత్వుడు "తమ్ముడూ!—సర్పరాజు నీకు ప్రాణస్నేహితుడని మురిసిపోయావు. కాని ఆ మణి అడిగేసరికే అతను మళ్లీ నీ గుమ్మం తొక్కచూడలేదే! ఇదేనా స్నేహలక్షణం? నీవు పెట్టిన చిన్నపరీక్షకు నిలవలేని అతను స్వార్థపరుడుకాని నిజమైన స్నేహితుడు కాడు. కనుక, నీవెంతమాత్రమూ విచారించకు. అతనికోసం బెంగపెట్టుకోకు' అని హితబోధచేసి తన కుటీరానికి వెళ్లాడు.

అన్న మాటలలోని అంతర్యం గ్రహించిన చిన్నవాడు అప్పటినుంచీ సర్పరాజును తలవడమే మానివేశాడు.




# అపూర్వవస్తువు

భవానీనగరంలో జయవర్మ అని ఒక గొప్ప ధనికుడు ఉండేవాడు. ఆయనకు జయపాలుడూ, విజయుడూ, జయుడూ అని ముగ్గురు కుమారులుండేవారు. వారిమధ్య వయసులోగాని, రూపురేఖలలోగాని, విద్యావినయాదులలోగాని ఆటే వ్యత్యాసం ఉండేదికాదు.

నిజంగా ఆ అన్నదమ్ములు చాలా బుద్ధిమంతులు, అన్యోన్యప్రేమ గలవారు. వారి మధ్య రహస్యాలు లేవు. ఒక్క విషయం మటుకు వారు ఒకరితో ఒకరు చెప్పుకుని ఎరగరు. అదేమంటే, వారు ముగ్గురూ కూడా భవానీనగరపు రాజకుమార్తెను ప్రేమించారు. ఆమెనే ఎప్పటికైనా, ఎలాగైనాసరే పెళ్ళాడితీరాలని గట్టిగా తీర్మానించుకున్నారు.

వారు ముగ్గురూ ప్రతి సాయంకాలమూ రాజసౌధం పక్కగా ఊరివెలపల గల ఉద్యానవనానికి షికారువెళ్ళేవారు. వారు వెళ్ళేవేళకు రాజకుమార్తె నిరుపమాదేవి రాజభవనంపైన విహరంచేస్తూ వారికి కనిపించేది. ఒక్కొక్క రోజు ఆమె వీణ వాయిస్తూ సాంధ్యరాగాలు ఆలాపన చేయటంకూడా వారికి వినిపించేది. కాని ఆ అన్నదమ్ములుమటుకు తమలోతాము రాజకుమార్తెనుగురించి ఎన్నడూ మాట్లాడుకునేవారుకారు.

ఇలా కాలం గడుస్తూవుండగా ఒకనాడు జయవర్మ తన కుమారులను ముగ్గురినీ పిలిచి ఈ విధంగా హెచ్చరించాడు :

"కుమారులారా! నేను వృద్ధుడనైపోయాను. నేను సంపాదించిన ధనంతో మీరు సుఖంగా జీవనంచేయవచ్చు. కాని అది పురుషలక్షణం కాదు. మీకు వివాహం చేసుకునే వయసు దగ్గిరపడింది. వివాహానంతరం మీకు వేరు వేరు సంసారాలేర్పడ

ఎస్. తిరుమలరావు





తాయి. బిడ్డలు కలుగుతారు. క్రమంగా ధనం తరిగిపోగలదు. అందుచేత మీరు పురుషధర్మంగా దేశపర్యటన చేసి, ధనం ఆర్జించండి. తరువాత వివాహాలు చేసు కుని గృహస్థాశ్రమంలో ప్రవేశించండి.''

పితృవాక్యపాలకులైన ఆ యువకులు తండ్రి చెప్పిన ఈ మంచి సలహాను శిర సావహించినవారై, మంచి ముహూర్తాన కొంత ధనంతో ఇల్లు వెడలి ఉత్తరాభి ముఖులై బయలుదేరారు. ఒకరోజల్లా నడిచి మహాపటమనే సంతనగరం చేరారు.

ఈ సంతలో అన్నదమ్ములు ముగ్గురూ తమకునచ్చిన సరుకులను కొన్నారు. ఆనాడు శివరాత్రి. మర్నాడు ఉదయం బయలుదేరి ముగ్గురూ మూడుదిక్కులా వెళ్ళిపోయి, మళ్ళీ వచ్చే శివరాత్రినాటికి ఇక్కడే, ఈ మహాపటం సంతలోనే కలుసుకునేటట్టు నిర్ణయం చేసుకున్నారు.

చూస్తూవుండగానే వారాలూ, నెలలూ గడిచాయి. మళ్ళీ శివరాత్రి వచ్చింది. మహాపటంలో సంత గొప్పగా జరుగుతోంది. ఎన్నడూరాని అపూర్వవస్తువులెన్నో ఆ ఏడు సంతకు వచ్చాయి. అందరిలోకి చిన్న వాడైన జయుడు అనుకున్నప్రకారం సంత వద్దకు చేరుకున్నాడు. గడచిన సంవత్సర కాలంలో అతను ఎంతో ధనం ఆర్జించాడు. అందుచేత అన్నలు వచ్చేలోపుగా తన దగ్గిర వున్న డబ్బులో కొంత ఖర్చుచేసి, ఏదైనా అపూర్వవస్తువు కొందామనుకున్నాడు.

ఎన్నో వస్తువులు కనిపించాయి. వాటిలో ఒకటి జయుణ్ణి ఆకర్షించింది. అదొక నిమ్మపండు. కాని అదిమామూలు నిమ్మ పళ్లలాటిది కాదు. ఎవరు ఎలాటి భయంకర వ్యాధితో బాధపడుతున్నాసరే ఆ పండు కోసి నోట పిండితే తక్షణం ఆ వ్యాధి నయమవు తుంది. వెయ్యి వరహాలకు ఆ నిమ్మ పండును కొని జయుడు అన్నలకోసం సంతలో వెతకసాగాడు.





ఆ రోజునే విజయుడుకూడా అనుకున్న ప్రకారం అక్కడికి తిరిగివచ్చాడు. అతనికి కూడా వ్యాపారం అచ్చివచ్చింది. అతను కూడా సంతలో ఒక అపూర్వ వస్తువును వెయ్యి వరహాలిచ్చి కొన్నాడు. అదేమిటంటే ఒక తివాసీ. ఐతే మామూలు తివాసీమటుకు కాదు. దానిమీద కూర్చొని ఎక్కడికి పోవాలంటే అక్కడికి క్షణంలో పోవచ్చు.

అందరికన్న పెద్దవాడు జయపాలుడు కూడా ఆరోజే తిరిగివచ్చాడు. అతనివద్ద కూడా చాలా ధనం పోగయింది. అతను కూడా ఎన్నో అపూర్వ వస్తువులను బేరం చేశాడు. ఆఖరుకు ఒక చిన్న దుకాణంలో అతని కొక అద్దం దొరికింది. దాని విలవ వెయ్యి వరహాలని చెప్పాడు దుకాణదారు.

"మామూలు అద్దానికి వెయ్యి వరహాలెందుకు? ఈ అద్దంలో గల విశేషమేమిటి?" అన్నాడు జయపాలుడు.

"అయ్యా, ఇది అందం చూసుకునే అద్దం కాదు. మీరు ఎవరిని తలుచుకుని ఈ అద్దంలోకి చూస్తే వారు ఆ క్షణాన ఉన్నస్థితిలో కనిపిస్తారు," అన్నాడు దుకాణదారు.

జయపాలుడి మనస్సు చటుక్కున నిరుపమాదేవివైపు పోయి, ఆమెను ఒక్క




సారి చూడాలన్న అభిలాష కలిగింది. అతను సంకోచించకుండా దుకాణదారుకు వెయ్యి వరహాలూ ఎంచి యిచ్చి అద్దం పుచ్చుకున్నాడు. నిరుపమాదేవిని తలచుకుని అద్దంలోకి చూశాడు. మరుక్షణమే అతనికి భరించరానంత బాధ కలిగి గుండె బరువెక్కింది.

ఎందుకంటే ఆ అద్దంలో జయపాలుడికి రాజకుమార్తె కనిపించింది. కాని ఆమె మరణబాధలో వుంది. వైద్యుడు నాడి పరీక్షించి పెదవి విరిచి తల అడ్డంగా తిప్పుతున్నాడు! ఆమె జీవితం క్షణాలలో వుంది. చూస్తే, తాను సరీగా ఒక్క రోజు ప్రయాణపు




దూరంలో ఉన్నాడు. కాని తను వెళ్ళేసరికి అంతా అయిపోయేలా వుది.

చెమ్మగిల్లి, సరిగా కనిపించని కళ్ళతో దుఃఖంచేత తూలుతూ జయపాలుడు దుకాణం దాటి కొద్దిదూరం వచ్చాడో లేదో విజయుడు అతనికెదురై "అన్నా!" అని పలకరించాడు.

జయపాలుడి ప్రాణం కొంత తేరుకున్నది. "చూడు, విజయా!" అంటూ అతను అద్దంలో రాజకుమార్తె దుస్థితిని అతడికి చూపాడు. చూపి, "ఈ ఘోర సమయంలో మనం ఇంత దూరాన ఉండిపోయాం. అదే నా విచారం!" అన్నాడు.

"నీకా భయం వద్దు," అన్నాడు విజయుడు. చంకలో వున్న తివాసీ విప్పి నేల మీద పరుస్తూ, "దీనిమీద కూచుని ఒక్క క్షణంలో మనం రాజకుమార్తె శయ్యవద్ద వాలవచ్చు" అన్నాడు.

జయపాలుడికి మరికొంత ఉత్సాహం వచ్చింది. పరిచిన తివాసీమీద వాళ్ళిద్దరూ ఆసీనులు కాబోతున్న సమయంలో "అన్నలారా!" అంటూ జయుడు వచ్చాడు.

"మాట్లాడటానికి వ్యవధి లేదు. వేగిరం తివాసీమీద కూచో. కడసారి నిరుపమాదేవిని ప్రాణంతో ఉండగా చూచివద్దాం!" అన్నాడు విజయుడు.

మారు మాటాడకుండా జయుడు తివాసీ మీద కూర్చున్నాడు. మరుక్షణం వారు భవానీపుర రాజసౌధంలో నిరుపమాదేవి మరణశయ్య పక్కన ఉన్నారు.

జయుడు ఆమె సమీపానికి వెళ్ళి తన వద్ద వున్న నిమ్మపండును కోసి, పాలిపోయిన ఆమె పెదవులమధ్య రసాన్ని పిండాడు.

మరుక్షణమే రాజకుమార్తెలో ఆశ్చర్యకరమైన మార్పు కలిగింది. ఆమె ముఖానికి తిరిగి కాంతి వచ్చింది. కొద్ది క్షణాలలో ఆమె కళ్ళుతెరిచి లేచి కూర్చున్నది. అక్కడ వున్నవారంతా ఆనందాశ్రువులు రాల్చారు.






రాజబంధువుల ఆనందంకన్న సోదరుల పట్ల రాజుగారు కనబరిచిన కృతజ్ఞత అపారమైంది. ఆయన ముగ్గురుసోదరుల చేతులూ పట్టుకుని, "నాయనలారా! మీరు నా కుమార్తెను బతికించటానికి స్వర్గం నుంచి అవతరించిన దేవతలుగాని మానవ మాత్రులు కారు. మీరు నా యింటనే ఉండి నా కుమార్తె వివాహం అయేవరకూ నా ఆతిథ్యం స్వీకరించాలి," అన్నాడు. అన్నదమ్ములు సమ్మతించారు.

అయితే ఒక్క చిక్కు వచ్చి పడింది. తన కుమార్తె వ్యాధి కుదిర్చినవారికి ఆమె నిచ్చి వివాహంచేస్తానని రాజు చాటించి వున్నాడు. ఆ ప్రకారం ఈ ముగ్గురిలో ఎవరో ఒకరికి ఆమెనిచ్చి చేయటానికి రాజు నిశ్చయించాడు. ఈ గౌరవం ముగ్గురిలోనూ ఎవరికి దక్కుతుందో నిర్ణయించమని రాజు మంత్రిని పురమాయించాడు.

అయితే ముగ్గురి కథనమూ విన్నమీదట మంత్రికూడా అయోమయంలో పడ్డాడు. రాజకుమార్తె ప్రాణం కాపాడినవారు ముగ్గురిలో ఎవరయినట్టు? జయపాలుడు తన అద్దంలో కనిపెట్టకపోతే నిరుపమాదేవి వ్యాధినిగురించి వారికి తెలిసి వుండదు. విజయుడు తివాసీ సహాయం లేకపోతే వారు సమయానికి రాగలిగి వుండరు. జయుడి నిమ్మపండు లేకపోతే ఆమె వ్యాధి నివారణ అయేవుండదు.

"పోనీ, రాజకుమార్తెను యెవరు పెళ్లాడతారో మీలో మీరు తేల్చుకుని చెప్పండి!" అని అన్నదమ్ముల నడిగితే, ఎన్నడూ తగువులాడని ఆ సోదరులు ఆమెను నేనే పెళ్ళాడాలంటే, నేనే పెళ్ళాడాలని వాదించసాగారు.

"మహాప్రభూ! ఇది తార్కికులవల్లగాని తేలదు. సభ ఏర్పాటుచేసి గొప్ప తార్కికులను పిలిపించి సమస్య ఇద్దాం!" అన్నాడు మంత్రి. రాజు సరేనన్నాడు.



కొద్ది రోజులలో సభ ఏర్పాటయింది. రోజులతరబడి వాగ్వాదాలు జరిగాయి. సమస్య ఉన్నచోటనే ఉండిపోయింది.

చిట్టచివరకు రాజకుమార్తె నిరుపమాదేవి జోక్యంకలిగించుకున్నది. ఈ సమస్యను పరిష్కరించే మార్గం సూచించటానికి తనకుకూడా అవకాశం ఇమ్మని సదస్యులను వేడుకున్నది.

తాము పరిష్కరించలేని సమస్యను ఆమె పరిష్కరిస్తుందా అని దిగ్గంతులవంటి తార్కికులు ఆశ్చర్యపడ్డారు.

"మీరంతాకూడా తప్పుతోవను ఆలోచిస్తున్నట్టు నాకు తోస్తుంది. నా ప్రాణం కాపాడటానికి ఈ ముగ్గురు సోదరులలో ఎవరు ఎక్కువబాధ్యులనే విషయం మీరు వితర్కిస్తున్నారు. ముగ్గురూ సమంగానే బాధ్యులు. అయితే, ఒక ముఖ్యమైన విషయం మీరు ఉపేక్షించారు. అదేమిటంటే, నా కోసం ఎవరు ఎక్కువ త్యాగం చేశారనేది.

జయపాలుడి అద్దం, విజయుడి తివాసీ, జయుడి నిమ్మపండు, మూడూ నాకు ప్రాణదానం చేశాయి. అయితే జయపాలుడి అద్దం జయపాలుడికున్నది, దానిలో ఆయన ఇతరులని చూడవచ్చు. విజయుడి తివాసీ విజయుడికున్నది, దానిపైన ఆయన ఇతర స్థలాలకు వెళ్ళవచ్చు. కాని జయుడి నిమ్మపండు ఖర్చయిపోయింది. దానితో ఆయన మరెవర్నీ బతికించుకోలేడు. నాకు భర్త కాగలవారెవరో తమరందరూ ఆలోచించి ఇప్పుడు నిర్ణయించండి!" అన్నది రాజకుమార్తె.

నిరుపమాదేవి బుద్ధిసూక్ష్మతకు అందరూ హర్షించారు. ఆమెకూ, జయుడికీ వైభవంగా వివాహం జరిగింది.

జయుడు తనకు అన్నివిధాలా తోడ్పడిన అన్న లిద్దరినీ గొప్పగా గౌరవించాడు. తన కుమారులు యీ విధంగా ప్రయోజకులైనందుకు జయవర్మకూడా సంతోషించాడు.






అరేబియాదేశంలోని ఒక గ్రామంలో ఆలీ మహమ్మద్ అనేవాడొకడుండేవాడు. అతను చాలా సాధువు. ఒకరి జోలికీ సొంటికీ పోయేవాడుకాడు. అందుచేత అతను అమాయకుడని అందరూ అనుకునేవారు.

ఒకరోజు అతని మిత్రులిద్దరు అతనితో దయ్యాలున్నాయని వాదించారు. దయ్యాలూ, భూతాలూ ఏమీ లేవన్నాడు ఆలీమహమ్మద్. ఊరికి పడమరగా వున్న కొండమీది జువ్విచెట్టు నిండా దయ్యాలూ, భూతాలూ ఉన్నాయన్నారు ఆలీ మిత్రులు.

"అదంతా శుద్ధఅబద్ధం," అన్నాడు ఆలీ.

"చెప్పటం తేలికే. అమావాస్య రాత్రి కటికచీకటిలో నువు ఒంటరిగా ఆ చెట్టు కింద గడపగలవా?" అన్నారు మిత్రులు.

"నాకేం భయంలేదు," అన్నాడు ఆలీ.

"అయితే రేపే అమావాస్య. రేపు రాత్రి తెల్లవార్లూ గాఢాంధకారంలో కొండమీది దయ్యాల జువ్వికింద కూర్చో. ఆ పనిచేయగలిగితే నీకు సుష్టుగా భోజనం పెట్టిస్తాం. లేనిపక్షంలో నువు మాకు భోజనం పెట్టించాలి," అన్నారు ఆలీ మిత్రులు.

సరేనన్నాడు ఆలీ. మర్నాడు సాయంకాలం కంచరగాడిదలమీద ముగ్గురు స్నేహితులూ కొండమీదికి వెళ్ళారు. పొద్దుగూకే సమయానికి ఆలీని జువ్విచెట్టుకింద వదిలిపెట్టి, అతనికంచరగాడిదెతో సహా అతని స్నేహితులు గ్రామానికి తిరుగుముఖం పట్టారు. వెళ్ళిపోయేటప్పుడు వారు ఆలీతో "అనుకున్న నియమాలన్నీ విధిగా పాటించాలిసుమా. రేపుఉదయమే నీకొరకు వస్తాం. అప్పటివాకా నీవు జీవించివుంటే మనం తిరిగి కలుసుకొందాం, సరేనా?" అని నవ్వుతూ వెళ్ళిపోయారు.

కొండచాటున ఉండటంవల్ల అప్పుడే గ్రామంలో చీకటిపడింది. క్రమంగా అన్ని

కె. రమణారా



ఊహించుకుంటూ, చలి బాధా, ఆకలి బాధా మరచిపోవటానికి యత్నించాడు అలీ. ఎందుచేతనోగాని ఆ దీపం తెల్లవార్లూ అలా వెలుగుతూనే వుంది.

ఎట్లాగైతేనేం తెల్లవారింది. అలీ మిత్రులు మూడు కంచరగాడిదెలతోసహా వచ్చారు.

"ఆకలి దహించుకుపోతోంది. పందెం గెలిచానుగనక నాకు వేగిరం అన్నం పెట్టించండి" అన్నాడు మిత్రులతో అలీ.

"కాస్త గుర్రాన్ని కట్టెయ్యి. మనం అనుకున్న నియమాలన్నిటినీ నువు పాలించి ఉంటేనే మేం ఓడిపోయినట్టు. లేనిపక్షంలో నువే ఓడిపోయినట్టు," అన్నారు మిత్రులు.

"తెల్లవార్లూ చీకటిలో ఈ జువ్వి చెట్టు కింద గడిపానుగదా. ఇంకేం నియమాలున్నాయి?" అన్నాడు అలీ.

"ఆలోచించుకో! తెల్లవార్లూ గాఢాంధకారంలో గడిపావా?" అన్నారు మిత్రులు.

"నా దగ్గిర దీపం లేందే?" అన్నాడు అలీ అనుమానంగా వాళ్ళని చూస్తూ.

"నీదగ్గిర లేకపోతే సరా? గతరాత్రి ఊళ్ళో ఒక మిద్దెలోని ఒక గదిలో తెల్లవార్లూ కొవ్వొత్తి ఒకటి వెలిగినట్టు మాకు తెలియవచ్చింది. ఆ దీపకాంతి నీకుగానీ కనిపించలేదు గద?" అన్నారు వాళ్లు.

ఇళ్లలోనూ దీపాలు వెలిగాయి. కొద్దిసేపట్లో చలి ఆరంభమయింది. క్రమంగా మంచు కూడా పడనారంభించింది. అలీకి చలి బాధా, ఆకలిబాధా ఎక్కువయింది.

"ఈ బాధలతో పోలిస్తే, దయ్యాలవల్ల కలిగేబాధ ఒక లెక్కలోదా? తెల్లవారిపందెం గెలవగానే ముగ్గురకు సరిపడిన భోజనం నేనే చేసేస్తాను," అనుకున్నాడు అలీ.

రాత్రి గడిచినకొద్దీ గ్రామంలోని దీపాలన్నీ ఆరిపోసాగినయి. ఒక్క మిద్దెమీది గదిలో మాత్రం దీపం ఆరకపోవటం గమనించాడు అలీ. ఆ గదిలో ఎవరు మేలుకున్నారో, ఎందుకు మేలుకున్నారో

అలీ ఆశ్చర్యపోతూ, "మీరన్న మాట నిజమే..." అని నసిగాడు.

"మరేం? నువు ఓడిపోయావు. ఇప్పుడు మాకే నువు భోజనం పెట్టించాలి," అన్నారు ఆ మిత్రులు.

"ఎక్కడో మైలు దూరాన ఎవరో కొవ్వత్తి వెలిగిస్తే ఆ కాంతి నాకు సాయపడిందా?" అన్నాడు అలీ నిర్ఘాంతపోయి.

"మైలు అయేది, రెండు మైళ్లు అయేది! నీకు తెల్లవార్లూ ఆ కాంతి కనిపించినప్పుడు నువు గాఢాంధకారంలో ఉన్నట్టు ఎలా అవుతుంది?" అన్నారు మిత్రులు.

తనను మోసగించటానికి వారే తెల్లవార్లూ ఆ కొవ్వత్తి వెలిగించి, కాంతి తనకు కనిపించేలాగు చేశారని అలీకి అర్థమైంది.

"సరే, నేను పందెం ఓడానంటున్నారు గనక, భోజనాలవేళకి మా యింటికి రండి. ఇద్దరికీ భోజనం పెడతాను," అంటూ అలీ తన ఇంటికి వెళ్లిపోయాడు.

అమాయకుడైన అలీని మోసంచేసి విందుభోజనం సంపాదించామన్న ఆనందంలో అతని మిత్రులిద్దరూ భోజనాల సమయానికి అతనిఇంటికి వెళ్ళారు. అలీ వారికి గొప్పగా స్వాగతమిచ్చి కూచోబెట్టి లోకాభిరామాయణం ప్రారంభించాడు.



చాలాసేపు సంభాషణ జరిగాక అతిథులు, "ఇంతకీ వంట ఇంకా కానేలేదా ఏమిటి?" అని అలీని అడిగారు. అలీ గబగబా లోపలికి వెళ్లి తిరిగివచ్చి, "ఇంకా కాలేదు," అని చెప్పాడు. మళ్లీ కాసేపు ముచ్చట్లు జరిగాయి. మరోసారి అలీ లోపలికి వెళ్లివచ్చి, "అవుతోంది," అన్నాడు.

సూర్యుడు నడినెత్తికెక్కాడు. అతిథ్యానికి వచ్చిన అలీ మిత్రులకు ఆకలిబాధ మిక్కుటమైంది. ఈలోపుగా అయిదారు సార్లు లోపలికి వెళ్ళివచ్చి, "కావస్తోంది, అవుతోంది!" అన్నాడేగాని వంట ఎంతట్లో అయేదీ చెప్పలేదు అలీ.

చివరకు అలీ మిత్రులలో ఒకడు, "ఆలస్యం అవనే అయింది, పదార్థాలయినా మంచివి చేయిస్తున్నావా?" అని అడిగాడు.

అలీ తాను వండుతున్న మాంసాలూ, కూరలూ ఏకరుపెట్టాడు. అతిథులు సంతోషించి మళ్ళీ మాటలలో పడ్డారు. క్రమంగా అపరాహ్ణమయింది. అలీ మరో సారి లోపలికి వెళ్ళివచ్చి, "ఇదుగో, అవు తోంది!" అన్నాడు మళ్ళీ.

అలీ స్నేహితులిక భరించలేకపోయారు.

"ఏదీ? నువు చేసే వంట మాకొక్క సారి చూపించు. లేకపోతే మాకు సంతృప్తి వుండదు," అన్నారు.

"నా మాట నమ్మకపోతే మీరు స్వయంగా వచ్చి చూసుకోవచ్చు." అంటూ అలీ తన అతిథులను వంటయింట్లోకి తీసుకుపోయాడు. పొయ్యిమీద పెద్దబానలో అలీ చెప్పిన మాంసాలూ, కూరలూ ఉన్న మాట నిజమే కాని, ఏం చెప్పాలి? బాన కింద కట్టెలులేవు, మంటాలేదు—కేవలం ఒకేఒక కొవ్వత్తి వెలుగుతోంది!

"అరె, ఇంతసేపూ మా వంట ఈ కొవ్వత్తితో చేస్తున్నావా? ఇట్లాఅయితే ఈ వంట ఎప్పటికి అయేటట్టు? మేం ఎప్పటికి భోంచేసేటట్టు? దగా! పచ్చి మోసం!" అన్నారు అలీ మిత్రులు.

"స్నేహితులారా! మీ మాటలు నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. మైలుదూరం నుంచి గాఢాంధకారాన్ని పారదోలగల కొవ్వత్తి ఇద్దరు మనుష్యులకు వంట చెయ్య లేదా? నా భోజనం అయిందిగనక నాకేమీ తొందరలేదు. తొందరపడకుండా వుంటే వంట కాగానే మీరుకూడా సుష్టుగా భోజనం చేయవచ్చు," అన్నాడు అలీ.

ఈ మాటలకు సిగ్గుపడి అలీమిత్రులు వచ్చినదారినే వెళ్ళిపోయారు. ఆ తరువాత మరెన్నడూ అలీని మోసగించటానికి యెవరూ ప్రయత్నించలేదు.






## 7

[అగ్నిపర్వతపు మంటల్నించి దూరంగా పారిపోతున్న సమరసేనుడూ, సైనికులూ-తల కిందులుగా చెట్టుకు వేలాడదీయబడిన మనిషిని చూచారుగదా? తరవాత కాలిగుర్తుల్ని అనుసరించి పోతున్నవారికి ఏనుగులమంద ఎదురైంది. వాళ్లు చెట్లెక్కారు. చూస్తే ఆ కాలిబాటలు ఏనుగుల పాదాలకింద నలిగి, గుర్తులేకుండా పోయినై. తరువాత—]

సమరసేనుడూ, సైనికులూ నిశ్చేష్టులై అలా చెట్లకింద నిలబడ్డారు. ఏనుగుల కాళ్లకింద నలిగిన చెట్లకొమ్మలు చుట్టూ చెల్లాచెదురుగా పడివున్నయి. అగ్నిపర్వతం మాటుమణిగినట్టు అంతా నిశ్శబ్దంగా వుంది.

కాని దూరంగా అక్కడక్కడ అడవి తగలబడుతూ వున్న సూచనగా మంటలు కనబడుతూనే వున్నయి.

అందరూ నిరుత్సాహపడిపోయారు. తమ ఓడలు ఉంచివచ్చిన తూర్పుతీరం చేరుకునే ఆశలు అడుగంటినై. ఇంతటితో మాంత్రికుల బెడద తీరిందనుకోవటానికీ ఆస్కారంలేదు. ఒక వైపున క్రూరమృగాల బాధ, అగ్నిపర్వతపు భుగభుగలు, దాట శక్యంగాని నదులు. ఈ ద్వీపంలో ఏదో ప్రాంతంలో నివసిస్తూన్న మానవులదగ్గరకు చేరుదామంటే ఆ యత్నమూ విఫలమైంది.

ఇప్పుడు ఏంచేయాలి? ఏ మార్గం అనుసరించాలి? అందరినీ ఇదే ప్రశ్న ఎంతగానో బాధిస్తోంది. ఇక సమరసేనుడు ఎంత ఆలోచించినా ఒక దారీ తెన్నూ దొరకక వెలవెలపోతున్నాడు.



ఇలాంటి స్థితిలో వాళ్ళందర్నీ ఆశ్చర్యంలో ముంచేటట్టు ఒక ఆర్తనాదం వినిపించింది. ఆ గొంతు ఏకాకీదీ కాదు, చతుర్నేత్రుడిదీ కాదు. ఘోరవిపత్తులో వున్న ఒక మానవప్రాణి చేసే ఆర్తనాదం.

సైనికులు నివ్వెరపోయి తమ నాయకుడికేసి చూశారు. సమరసేనుడు తృటిలో ఒరనుంచి కత్తిదూసి "రండి, జాగ్రత్త సుమా!" అంటూ ఆ ఆర్తనాదం వినబడిన వైపు పరిగెత్తసాగాడు. సైనికులు కూడా కత్తులను సిద్ధంగా వుంచుకుని తమ నాయకుణ్ణి అనుసరించారు. వారు అలా ముందుకు పోతూన్నకొద్దీ ఆ మానవ



కంఠం మరింత స్పష్టంగా వినబడసాగింది. కొద్దిసేపటికల్లా వాళ్ళందరూ ఆ చోటుకు చేరుకున్నారు. అక్కడ కంటబడిన ఘోర దృశ్యం వాళ్ళను భయకంపితులనుచేసింది. మరుక్షణంలోనే ఏదో ఆశలాంటిది వారికి ఉత్సాహాన్ని ఇచ్చింది. ఈ మంత్రాలదీవిలో మొట్టమొదటిసారిగా వాళ్ళు జీవంతో వున్న మనిషిని చూడగలిగారు! కాని అతడు గొప్ప విపత్తులో చిక్కుకునివున్నాడు.

పాపం, వాణ్ణి ఎవరో పెడరెక్కలు విరిచి చెట్టుకు కట్టివేసిపోయారు. అలాంటి నిస్సహాయస్థితిలో ఉన్న అతడిని భక్షించేందుకు నాలుగైదు తోడేళ్ళు అక్కడికి వచ్చినై. అదే సమయంలో ఆకలిగొన్న ఒక పెద్దపులికూడా ఆ చాయలకే వచ్చింది. ఇప్పుడు ఆ దురదృష్టవంతుడి మాంసంకోసం తోడేళ్ళ మధ్యా, పెద్దపులి మధ్యా పోరాటం సాగుతోంది. భయకంపితుడైన ఆ మనిషి గగ్గోలుపెడుతున్నాడు.

సమరసేనుడు క్షణంలో పరిస్థితి అవగాహన చేసుకున్నాడు. పులి పంజాదెబ్బలకు ఒక్కొక్క తోడేలే అరుస్తూ కింద పడిపోతోంది. ఆ విధంగా శత్రుసంహారం చేసి, తరవాత తీరికగా మనిషిమాంసం రుచి చూడాలని పులి పోరాడుతోంది. అలసిస్తే





ప్రమాదమనుకొని సమరసేనుడు బాణం ఎక్కుపెట్టి పులిని గురిచూచి కొట్టాడు. ఆ దెబ్బకు పులి బొబ్బరిస్తూ కింద పడింది.

వెంటనే సైనికులు ముందుకు ఉరికారు. ఆకలిగొన్న తోడేళ్ళు అరుస్తూ వాళ్ళమీదకు దూకినై. సైనికులు జంకకుండా తమ చేతనున్న కత్తులతో వాటిని నరికివేశారు. అంతలో సమరసేనుడు అక్కడికి వచ్చి, చెట్టుకు బంధింపబడివున్న మనిషి కట్లు గబగబ విప్పాడు.

"నన్ను ప్రాణాపాయంనుంచి కాపాడిన మీరు నిజంగా మహానుభావులు. మీ మేలు ఎన్నటికీ మరవలేను!" అంటూ అతడు సమరసేనుడికీ సైనికులకూ నమస్కరించాడు.

ఆ మనిషి రూపురేఖలూ, మాట్లాడిన తీరూ చూడగా సమరసేనుడికి అత్యాశ్చర్యం కలిగింది. ఇతడు ఈ మంత్రాలదీవివాడు కాదని వెంటనే తెలిసిపోయింది. పైగా అతడు కుండలినీద్వీపవాసి అనికూడా సమరసేనుడికి అనుమానం కలిగింది.

"నువు ఏదేశస్థుడివి?" అని అడిగాడు సమరసేనుడు.

"నేను...నేను కుండలినీద్వీప సైనికుణ్ణి. ఆ రాజ్య సేనానాయకులైన సమరసేనుడు






మీరే కదా ?" అని ఆ వ్యక్తి ఆశ్చర్యపోతూ సమరసేనుడిని అడిగాడు.

సమరసేనుడికీ, సైనికులకూ ఆ ప్రశ్నతో కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. ఈ కొత్త వ్యక్తి తమతోపాటు ఓడలలో బయలుదేరి వచ్చినవాడు కాదని అందరికీ తెలుసు. అయితే ఇతడు ఎప్పుడు ఇక్కడికి చేరుకొన్నట్టు?

ఆ కొత్త సైనికుడు వీళ్ల మనోభావాలు గుర్తించినవాడిలా యిలా చెప్పసాగాడు:

"మీరు ఆనాడు ఓడలలో బయలుదేరేటప్పుడు తోకచుక్క కనబడిందిగదా ? అయినా మీరు ఆస్థాన దైవజ్ఞుని సలహాను పాటించకుండా బయలుదేరిపోయారు. ఆ తరవాత కొద్దిసేపటికి పెద్ద తుఫాను ప్రారంభమై, సముద్రం అల్లకల్లోలం కాజొచ్చింది. చిత్రసేన మహారాజు చాలా కలవరపడ్డారు. వరసగా నాలుగైదురోజులు మీ క్షేమంకోసం కుండలినీదేవికి పూజలూ, ఉత్సవాలూ చేయించారు.

కాని తుఫాను దాదాపు వారంరోజుల పాటు భయంకరంగా వీచింది. మీరు ఏమైపోయారో అని రాజూ, ప్రజలూకూడా దిగులుపడిపోయారు.

ప్రతిరోజూ వేలాది ప్రజలు రాజభవనానికి వచ్చి, సైనికులుగా ఓడల్లో వెళ్ళిన తమ బంధుమిత్రుల క్షేమ సమాచారాలు అడగసాగారు.

చివరకు చిత్రసేనమహారాజు ఆస్థాన దైవజ్ఞుడిచేత అంజనం వేయించి మీరు ఎక్కడ, ఏ స్థితిలో వున్నారో తెలుసుకోదలిచారు. ఒక శుభముహూర్తాన అంజనం వేసి చూశారు. ఓడలు మునిగిపోగా మిగిలిన కొద్దిమందీ ఒకానొక ద్వీపం చేరుకున్నట్టుగా తెలిసింది.

చిత్రసేనమహారాజు మంత్రిసామంతులతో సమాలోచన జరిపారు. ఆ కొద్దిమంది సైనికులతో మీరు ఏదో ఒక కొత్త ద్వీపానికి



చేరటంవల్ల ముప్పు కలిగే అవకాశం వున్నదని నిర్ణయించుకున్నారు. తరవాత వారం రోజుల్లో మరికొందరు సైనికుల్ని పోగుచేసి కుంభాండుని నాయకత్వంకింద మిమ్మల్ని వెతికేందుకు పంపారు."

"ఎవరీ కుంభాండుడు?... ఓహో కుంభాండ సంస్థానాధిపతా?" అన్నాడు సమరసేనుడు ఆశ్చర్యపడుతూ.

"అవును, వాడే! వాడివల్లనే యిప్పుడు నేనీ ప్రాణాపాయస్థితిలో యిరుక్కున్నాను" అన్నాడు సైనికుడు పళ్ళుకొరుకుతూ.



సమరసేనుడు ఆ మాటలతో నివ్వెరపోయాడు. సైనికులకు యిదేమీ అర్థం కాలేదు. తిరుగా ఆ కొత్త సైనికుడు ఇలా చెప్పసాగాడు:

"మేము కొద్దిరోజులకల్లా, యీ ద్వీపం చూశాం. దక్షిణప్రాంతంలో ఓడలు దిగి, తీరం చేరాం. కుంభాండుడు మమ్మల నందరినీ తీరందగ్గిరే వుండమని యిరువురు సైనికులతో ద్వీపంలోపలికి బయలుదేరాడు.

ఆ రోజల్లా మేము అతడికోసం ఎదురు చూస్తూ కాలం గడిపాం. మరుసటిరోజు తెల్లవారిన తరవాత కుంభాండుడు ఒంటరిగా తిరిగి వచ్చాడు. వస్తూనే మాదగ్గిర వున్న విల్లంబులూ అవీ తీసుకుని కట్టకట్టించి సముద్రంలో పారవేయించాడు. ఎంత ఆలోచించినా ఈ విడ్డూరం ఏమిటో మాకు అర్థం కాలేదు. పైగా అతడితో వెళ్ళిన యిద్దరు సైనికులూ ఏమయారో మాకు తెలీదు. అడిగితే వాళ్లను ఏదో అడవిజాతివాళ్లు చంపేశారని చెప్పాడు.

మాకు అనుమానం కలిగింది. విల్లంబుల్ని అలా కట్టకట్టి సముద్రంలో ఎందుకు పారవేయించాడో నిలదీసి అడిగాం.

దానికి కుంభాండుడు తను సేనానాయకుడుగా ఏది చేసినా తనను ఎవరూ ప్రశ్నించకూడదని కఠినంగాజవాబిచ్చాడు."

"అయితే కుంభాండుడుకూడా తన విల్లం







బులను సముద్రంలో పారవేశాడా?" అని అడిగాడు సమరసేనుడు అనుమానంగా.

"అదే చోద్యం! తన విల్లంబులు మాత్రం తను అట్టేపెట్టుకున్నాడు. మేము ప్రశ్నిస్తే తను నాయకుణ్ణనీ, ప్రశ్నించటం తనను ఎదిరించినట్టవుతుందనీ చెప్పాడు.

ఆ తరవాత కొద్దిసేపట్లోనే బరిశెలూ, యీటెలూ ధరించిన కొంతమంది ఆటవికులు వికృతంగా అరుస్తూ మా దగ్గరకు రాసాగారు. మాదగ్గర బాణాలు లేవు గనక, అక్కడ దొరికిన రాళ్లతోనూ, చెట్ల కొమ్మలతోనూ ఆత్మరక్షణకు తలపడ్డాం.

కాని కుంభాండుడు మమ్మల్నందరినీ, ఆ ఆటవికులకు లొంగిపోవలసిందని అజ్ఞాపించాడు. ఈ వింతధోరణి మాకు చాలా అశ్చర్యం కలిగించింది. మాలో అప్పటికే చాలామంది సైనికులు ఆ ఆటవికుల బల్లెపు పోట్లకు అహుతి అయిపోయారు. మిగిలినవాళ్లం చేసేదిలేక లొంగిపోయాం."

"అలా పోరాటం జరుగుతూంటే కుంభాండుడు మీకేమీ సాయంచేయలేదా?" అని అడిగాడు సమరసేనుడు ఆగ్రహాన్ని అణచుకుంటూ. దానికి సైనికుడు—

"అలాంటిదేమీ లేదు. మేము లొంగిపోగానే మమ్మల్ని పెడరెక్కలు విరిచి కట్టారు. కుంభాండుణ్ణి ఒక అందలంమీద ఎక్కించారు. దాన్ని కొందరు ఆటవికులు బుజాలమీద ఎత్తుకుని అరుస్తూ వాళ్ళ పల్లెలకు తీసుకుపోయారు.

మేము ఆ అటవికులకు బందీలుగా ఉండవలసి వచ్చింది. ఇక కుంభాండుడు వాళ్ళకు రాజుగా వ్యవహరించాడు.

ఆ అటవికజాతులకు అతడు ఎంత చెపితే అంత! వాళ్లమీద యింత అధికారాన్ని ఎలా సంపాదించాడా ఈ కుంభాండుడు అన్నసంశయం మమ్మల్ని బాధిస్తూనేవుంది."

"అదే నాకూ కలిగిన సంశయం!" అన్నాడు సమరసేనుడు నవ్వుతూ.





"మాకు కలిగిన సంశయం రెండు మూడు రోజులకల్లా తీరిపోయింది. ఆ ఆటవికులకు అసలు బాణాలంటే ఏమిటో తెలీదు. మనిషి కదలకుండా ఒక చోట నుంచుని, ఎక్కడో వున్న పక్షినిగాని, జంతువునుగాని బాణం విడిచి చంపటం, వాళ్ళకు గొప్ప మహిమలాగా కనబడింది! ఆ మహిమ తనకు ఒక్కడికే ఉందని చెప్పుకొని, వాళ్ల మీద రాజరికం సంపాదించేటందుకే కుంభాండుడు మా విల్లంబుల్నీ వాటినీ కట్ట కట్టి సముద్రంలో పారవేయించాడు.

ఈ రహస్యం అప్పట్లో మాకు తెలీలేదు. ఒకరోజున అడవిప్రాంతమంతా తప్పెట మోతలతో మారుమోగిపోయింది. వందల కొద్దీ అడవిజాతులవాళ్లు మేము వుంటున్న పల్లెకు వచ్చారు. వాళ్లందరిముందూ ఈ కుబుద్ధి కుంభాండుడు తన మహిమను ప్రదర్శించాడు! ఎక్కడో ఆకాశాన ఎగురుతూవున్న ఒక గరుడపక్షిని బాణంతో నేల కూల్చాడు. దూరంగా వున్న ఒక లేడిని మరొక బాణంతో పడకొట్టాడు.

విల్లూ అంబులూ అంటే ఏమిటో తెలియని ఆ అనాగరికులు కుంభాండుడిచుట్టూ చేరి నాట్యంచేశారు. వాళ్ళ సాయంతో ఈ ద్వీపానికి రాజుకావాలని కుంభాండుడి తాపత్రయం."

"ఏముంది ఇక్కడ పాలించేందుకు? అడవిమృగాలూ, అగ్నిపర్వతాలూ, ఒకరిద్దరు మాంత్రికులూ!" అన్నాడు సమరసేనుడు వికటంగా నవ్వుతూ.

"మాంత్రికులా?" అంటూ భయకంపితుడై ప్రశ్నించాడు ఆ సైనికుడు. "వాళ్ళ సంగతి విన్నాం! మమ్మల్ని......"

"వినటమే గాదు, చూడనూవచ్చు కావాలంటే!" అన్న కంఠనాదం ఆ ప్రాంతంలో మారుమోగింది. వెంటనే చతుర్నేత్రుడు తన కుచ్చుటోపీని చేతబట్టి వారిముందు ప్రత్యక్షమయ్యాడు. —(ఇంకా వుంది)








# ఇంటి పెత్తనం

పూర్వం ఒక ఊళ్ళో దండపాణి అనే గృహస్థు ఒకడుండేవాడు. ఆయన భార్య పేరు భద్ర. వారికి నలుగురు కుమారులు. నలుగురికీ వివాహాలు జరిగి భార్యలు కాపరాలకు వచ్చారు.

భద్రమ్మ ఇంటి పెత్తనంలో చాలా సమర్థురాలు. కాని తన తదనంతరం తన నలుగురు కోడళ్ళలో ఎవరు తన స్థానం ఆక్రమించగలుగుతారా అని ఆవిడకు బెంగ పట్టుకుంది.

తన భార్యకుగల విచారం గ్రహించి దండపాణి నలుగురు కోడళ్ళనూ పరీక్షించ దలుచుకున్నాడు. ఆయన ఒక్కొక్క కోడలినీ పిలిపించి, తలా అయిదు వడ్లగింజలూ ఇచ్చి, తాను తిరిగి అడిగేవాకా వాటిని భద్రపరిచి పెట్టమని హెచ్చరించాడు.

పెద్దకోడలు ఉజ్జిక ఈవిధంగా ఆలోచించింది: ఇంటి నిండా ఎప్పుడూ ధాన్యం ఉండనే ఉంటుంది. మామగారు ఏక్షణాన అయిదు వడ్లగింజలు తిరిగి ఇమ్మని అడిగినా గాదెలోనుంచి తీసుకుపోయి ఇవ్వ వచ్చు. ఈ భాగ్యానికి ఈ వడ్లగింజలను భద్రపరిచే దేమిటి? ఇలా అనుకుని ఉజ్జిక మామగారిచ్చిన అయిదు వడ్లగింజలూ అవతల పారేసింది.

రెండో కోడలు భోగవతికూడా ఉజ్జిక లాగే ఆలోచించింది. అయితే ఆమె వడ్లగింజలను అవతల పారెయ్యటానికి బదులు పొట్టు వొలిచి నోట్లో వేసుకుంది.

మూడవ కోడలు రక్షిక మామగారిచ్చిన వడ్లగింజలను భద్రంగా పొట్లంకట్టి తన పెట్టె అడుగున దాచింది.

నాలుగవ కోడలు రోహిణి ఈ విధంగా ఆలోచించింది: మామగారిచ్చిన ఈ గింజలను తిరిగి ఎప్పటికి అడుగుతారో తెలియదు. వడ్లగింజలు భద్రంచేసేది తినడా

పాలంకి వెంకటరామచంద్రమూర్తి




నికి, లేదా నాటడానికి. ఈ అయిదు గింజలు తినడానికేమూల. అందుచేత వీటిని భద్రంచేయడమంటే తిరిగి తరుణం వచ్చినప్పుడు నాటడమే. ఇలా అనుకుని రోహిణి తనకు మామగారిచ్చిన వడ్లగింజలను పుట్టింటికి పంపి పొలంలో నాటేయించింది.

రోహిణి పుట్టింటివారు అయిదు గింజలనూ నాటి అయిదు వరిమొక్కలు పెంచారు. పంట వచ్చాక కోశారు. మరుసటేడు గింజలకోసం కబురు రాలేదు. అందుచేత పంట యావత్తూ విత్తనాలుగా ఉపయోగించి మరుసటేడూ పండించారు.

ఈ విధంగా వరసన అయిదేళ్లు గడిచాయి. "ఏమండీ, నేనుచూస్తే పెద్దదాన్నయిపోయాను. ఇక ఇంటిపెత్తనం నావల్లకాదు. కోడళ్లలో ఎవరికి పెత్తనం వప్పగించాలో తేల్చిచెబుతానన్నారు. ఐదేళ్ళు గడిచినై. ఇకనైనా ఏదో విధంగా నిర్ణయించండి," అన్నది భద్రమ్మ తన భర్తతో.

దండపాణి సరేనని, తాను దాచమని ఇచ్చిన అయిదేసి వడ్లగింజలనూ తిరిగి తీసుకురమ్మని కోడళ్లను అడిగాడు. పెద్ద కోడళ్లు ఉజ్జికా, భోగవతీకూడా గాదెలో నుంచి అయిదేసి వడ్లగింజలు తెచ్చి మామగారి ఎదట పెట్టారు. మూడవ కోడలు రక్షిక తన పెట్టెఅడుగునుంచి పొట్లం తీసి నల్లబడిపోయిన వడ్లగింజలను తెచ్చి మామగారి కిచ్చింది.

దండపాణి వాటినిచూసి, "ఇవి నిజంగా నే నిచ్చినవే!" అన్నాడు. ఉజ్జికా, భోగవతీ తెచ్చిన గింజలు కొత్తపంటవి గనుక బంగారంరంగులో ఉన్నాయి.

"ఇవి నే నిచ్చిన గింజలు కావు. ఏం జరిగింది? నిజం చెప్పెయ్యండి!" అని దండపాణి పెద్దకోడళ్ళ నడిగాడు. వారు గత్యంతరంలేక చేసిన పని చెప్పివేశారు. దండపాణి కడసారికోడలు రోహిణితో,

"ఏవమ్మా నేను నిన్ను దాచమని ఇచ్చిన గింజలూ?" అన్నాడు.

"వాటిని మా పుట్టింటికి పంపాను. రావడానికి వ్యవధి కావాలి. రెండురోజులు గడువివ్వండి," అన్నది రోహిణి. సరేనన్నాడు దండపాణి. రెండు రోజులకల్లా రోహిణి పుట్టింటివారి ఊరునుంచి యాభై బళ్లమీద ధాన్యపు బస్తాలు దిగాయి. వాటినిచూసి అందరూ నివ్వెరపోయారు. అయిదేళ్ళ క్రితం అయిదు గింజలను సరిగా భద్రం చేయడంవల్ల యాభై బళ్ళ ధాన్యం తయారయింది.

"చూశావా? ఇంటిపెత్తనం నీ ఆఖరు కోడలు రోహిణి కివ్వు. ఏది యెలా భద్రం చేయాలో ఆమెకు తెలుసు," అన్నాడు దండపాణి తన భార్యతో.

"మిగిలిన ముగ్గురి మాట ఏమిటి? వారికికూడా ఏదైనా పని చూపించవద్దా?" అన్నది భద్రమ్మ.

"ఉజ్జిక పనికిమాలిన వస్తువులు పారబోసే మనిషి. చెత్తా చెదారమూ ఊడ్చి ఇల్లు శుభ్రంగా ఉంచే పని ఆమెకివ్వు.

భోగవతిది చేతికి దొరికిన వస్తువును అనుభవించే గుణం. ఆమెకు వంటయింటి పెత్తనం యివ్వటం మంచిది.

రక్షిక ప్రతి వస్తువునూ జాగ్రత్తగా రక్షించగలదు. కొట్టుపెత్తనం ఆమె చక్కగా నిర్వహిస్తుంది.

ఈ విధంగా పనులు విభజించినట్లయితే సంసారం సుఖంగా సాగిపోతుంది," అన్నాడు దండపాణి.

భద్రమ్మకు యీ ఏర్పాటు బావుందనిపించింది. ఆవిధంగానే తన కోడళ్ళకు పనులు విభజించింది. తాను ఇంటి పెత్తనంనుంచి విరమించి, హాయిగా "కృష్ణా, రామా!" అనుకొంటూ చీకూ చింతా లేకుండా మిగిలిన తన జీవితకాలాన్ని సుఖంగా వెళ్ళబుచ్చింది.



# మూగినోము

కుమారి బి. శమంతి

యువతి ఒకతె బావిచుట్టు
చేయుగా ప్రదక్షిణం
దారి బోవు ముని యొకండు
చూచి ఆగె తక్షణం.

'ఎందుకమ్మ తిరుగుతావు,
బావిచుట్టు నట్టులా?'
అనుచు యడిగినట్టి మునికి
యువతి చెప్పె నిట్టుల:

'అత్తగారి ఎత్తిపొడుపు
మామగారి మండలింపు
భర్తగారి ఈసడింపు
ఇరుగుపొరుగు ఓర్వలేమి
చూడలేక అత్యవస్థ!
బావిదరకు వచ్చినాను,
అసువుల నీ కూపమునకు
ఇవ్వ నిశ్చయించినాను.'

'బావికిచ్చు బదులు, నీదు
ప్రాణములను నాకు నిమ్ము'
అనుచు అడిగినట్టి మునికి,
అనెను 'సరే, తీసికొమ్ము.'

'వత్సరమ్ము వరకు నేను
యాత్రకొరకు పోవుచుంటి,
వచ్చువరకు నాదు సొమ్ము
కాపాడుమొ కలువకంటి!
నిన్నెవ్వరేమి తిట్టినను
ఎవరు ఎంత కొట్టినను
నీ ప్రాణము నాది, కాన
ఉండుమమ్మ మౌనముతో.'

ముని మాటల కామె ఎంతొ
సంతసముతొ సమ్మతించె,
తరువాతను తన ఇంటికి
వేడుకతో నేగుదెంచె.

బంధుల బాధలను ఆమె
మౌనముతో భరించినది,
కొద్ది గడువులోనె వారి
హృదయాల హరించినది.

గర్వముతో వారామెను
గూర్చి చెప్పుకొనిరి ఎంతొ,
ఆమె శాంతగుణము మెచ్చి
ఇచ్చి రింటి పెత్తనమును.

వచ్చినాడు మౌనివరుడు
వత్సరమైపోగానే
'నా ప్రాణము నాకి'మ్మని
ఆమె నడిగె ఎదురుగనే.

వినయముతో నన్నదామె
'తీసికొండి మీ ప్రాణం!
ఇప్పుడు ఆ ప్రాణమంటె
ఇంట నెంతొ అప్యాయం!!'
మునీశ్వరుడు అనె నిట్టుల
కనబరుస్తు మందహాసం:
'వద్దమ్మా నీ ప్రాణం
చాలును నీ సుఖవాసం.
నేర్పించుము అందరికూ
నీ నేర్పిన ఈ నీతిని,
ఇదియేనమ్మా నాకును
ప్రీతిని కలిగించు రీతి.'





# నీతి తప్పినవాడు

పూర్వం ఒకప్పుడు మణిపురిరాజ్యాన్ని శశాంకుడనే రాజు పరిపాలించేవాడు. అతడు తన రాజ్యంలో ధర్మాన్ని నాలుగు పాదాలా నడుపుతూ పాలన సాగిస్తున్నాడు. ఐతే—శశాంకుడికి ఒక్కటే చింత పట్టుకున్నది. తన రాజ్యంలో ధర్మం నిలిచి వున్నా, ఎవరికీ సంతోషం లేదు.

తెల్లవారింది మొదలు చీకటి పడేవరకూ ఎవరి పనులు వాళ్ళు చక్కబెట్టుకు పోతూ వుంటారు. కాని, ఎవరి మొహానా చిరునవ్వు అనేది కనపడదు.

ప్రజల్ని సంతోషపెట్టడానికి ఏమి చేయాలా అని శశాంకుడు తీవ్రంగా ఆలోచించసాగాడు, ఎన్నో ప్రయత్నాలు చేశాడు.

కాని, లాభం లేకపోయింది. రాజుకి విసుగెత్తింది. మంత్రికి రెండు రోజులు గడువు యిచ్చాడు. గడువులోగా ప్రజల ముఖాలమీద చిరునవ్వు కనపడకపోతే, మంత్రి మెడమీద తలకాయ వుండటానికి అర్హత లేదన్నాడు.

మంత్రికి ఏమీ తోచక అడివిలోకి పారిపోయాడు. తోవలో అతనికి ఒక ముని కనిపించాడు. మంత్రి ఆయనకు సాష్టాంగపడి కష్టం నివారించగలడేమో అని ఆయనను రాజమహలుకు తీసుకవచ్చాడు. రాజు మునీశ్వరుడికి ఆతిథ్యం ఇచ్చాడు.

తరువాత ఆ మహానుభావుడితో రాజు 'మా రాజ్యంలో ఎవరికీ సంతోషం లేదు. అందుచేత మాకూ ఆనందం లేదు. అసలు మాకు ఈ జన్మలో సంతోషం అనేది లేనేలేదా, మహాత్మా!' అంటూ అడిగాడు.

అందుకు మునీశ్వరుడు 'లేకేం మహారాజా!—నీ రాజ్యంలో ఏ ఒక్కరైనా నీతి తప్పి వున్నట్టయితే, ఆ తరువాత రాజ్యంలో సంతోషం వెల్లివిరుస్తుంది' అని చెప్పి వెళ్ళిపోయాడు.

జె. వి. కుమార్




మంత్రిని పిలిచి, రాజ్యంలో ఎవరు నీతి తప్పారో పిలిపించి అర్ధరాజ్యం బహూకరించమన్నాడు. మంత్రి వెళ్ళి రాజ్యం అంతా గాలించి వచ్చాడు. కాని, ఎవరూ నీతి తప్పినట్టు కనపడలేదు.

శశాంకుడు విదూషకుణ్ణి పిలిపించాడు. "నువ్వు యిన్నాళ్లూ మా సొమ్ము తింటూ కూర్చున్నావుగాని, మమ్మల్ని నవ్వించిన పాపాన పోయావా?—మన రాజ్యానికి నిన్న ఒక మునీశ్వరుడు వచ్చాడు. అతడు వచ్చినప్పటినుంచీ మన ప్రజకి సంతోషం కలిగింది. నువ్వు ఇప్పుడే ఆయనదగ్గరకు వెళ్లి ఆ కీలకం ఏదో తెలుసుకొని రా!' అని విదూషకుని పంపించాడు.

విదూషకుడు వెళ్లి రోజులూ, వారాలూ గడిచాయి. కాని, అతడు తిరిగివచ్చే సూచన కనపడలేదు. మంత్రిని పంపించాడు రాజు; మంత్రీ తిరిగి రాలేదు.

అందుచేత రాజే స్వయంగా బయలుదేరి మునీశ్వరుడి ఆశ్రమానికి వెళ్ళాడు. తక్కినవారిలాగానే రాజూ తిరిగి రాలేదు. రాజుకూడా తిరిగి రాకపోయేసరికి రాణికి కంగారు పట్టుకుంది. యువరాజును పంపిద్దామనుకుంది రాణి. కాని, ఒక్కగానొక్క కొడుకును పంపించివేస్తే రాజ్యానికి పాల

ఈ మాటలు విని రాజూ, మంత్రీ మళ్ళీ అనేక ప్రయత్నాలు చేసి చూశారు. కాని, ప్రజల్లో ఏ ఒక్కరూ ధర్మం తప్పేటట్టు కనబడలేదు.

ఒకనాడు తెల్లవారుఝామున రాణి చిరునవ్వుతో వచ్చి శశాంకుణ్ణి లేపింది. మందహాసంతో వున్న భార్యని చూసి, రాజు ఆశ్చర్యపోయాడు. బయటికి వచ్చేటప్పటికి సేనాధిపతీ, మంత్రీ మాట్లాడుకుంటూ బిగ్గరగా నవ్వుకుంటున్నారు. రాజు దాసదాసీజనాన్ని చూచాడు. అందరి ముఖాలలోనూ సంతోషం పూర్తిగా తొణికిసలాడుతూవుంది. రాజు మనస్సుకు ఎంతో శాంతి ఏర్పడింది.

కులు ఎవరూ ఉండరుకద! అందుచేత అతడిని పంపకుండా ఊరుకున్నది.

ఇక మణిపురిరాజ్యానికి పక్కనే ఒక సామంతరాజ్యం వుంది. ఆ సామంతరాజు గొప్ప బలశాలి. సమయందొరికితే శశాంకుడి మీద ఎదురుతిరుగుదామని చూస్తున్నాడు. ఇంకేం? యిప్పుడు ఆ సమయం వచ్చింది అనుకున్నాడు. చతురంగ బలంతో మణిపుర రాజ్యంమీదికి దండెత్తి వెళ్ళాడు.

చేసేది ఏమీలేక రాణి తన కొడుకును పంపించింది రాజును తీసుకురమ్మని. యువరాజు మునీశ్వరుడి ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ రాజూ, మునీ చదరంగం ఆడుతూ మంచి దీక్షలో వున్నారు. ఓడిపోయిన మంత్రీ, విదూషకుడూ ఒకపక్కన తెల్లమొహాలతో చూస్తూవున్నారు.

యువరాజు ఆత్రంతో సంగతి సందర్భాలు చెప్పి, వెంటనే బయలుదేరమన్నాడు తండ్రిని. కాని, రాజు 'మరి రెండు ఆటలు ఆడితేగాని, ఇక్కడినించి కదలలేనురా' అన్నాడు. యువరాజు కేమీ తోచలేదు. తండ్రి సంగతి చూస్తే కదిలివచ్చేటట్టు లేదు. శత్రువులు కోట చుట్టివేశారు. అందుచేత తానే సైన్యాన్ని నడిపి సామంతరాజును ఎదిరించాడు.




ఆ సామంతరాజుది చాలా గొప్పసైన్యం. అతడూ మహా బలవంతుడు. కనుక, యువరాజును అతడు సులభంగా ఖైదుచేశాడు. ఖైదీలుగా చిక్కకుండా తప్పించుకున్న కొందరు మణిపుర సైనికులు పోయి శశాంకుడితో యీ వార్త చెప్పారు. ఈ వార్త చెవినిపడేటప్పటికి రాజు ఉగ్రుడయ్యాడు. సైన్యాన్ని మళ్ళీ కూడదీసుకొని శత్రురాజు మీదికి నడిపాడు. యుద్ధతంత్రంలో శశాంకుడి నేర్పు చూసి సామంతరాజుకు హడలుచ్చుకుంది. వెనక్కి తిరిగి చూడకుండా దౌడుతీశాడు. వెంటనే శశాంకుడుకొడుకును చెరనుంచి విడిపించి నగరు చేరుకున్నాడు.

రాజు సభచేసి, మునీశ్వరుడికి అర్ధ రాజ్యం ఇవ్వబోయాడు. కాని, 'సౌఖ్యాలు వదులుకొని, అడవులలో కందమూలాలు తిని బతికే మాకెందుకు మహారాజా, ఈ రాజ్యాలూ అవీ?' అన్నాడు ముని.

తరువాత తమ కర్తవ్యాన్ని మరిచి చదరంగం ఆడుతూ కూర్చున్న మంత్రికీ, విదూషకుడికీ ఉరిశిక్షలు విధించమన్నాడు శశాంకమహారాజు.

మంత్రికి గుండెలో రాయి పడ్డది. విదూషకుడు బెదిరిపోయాడు. కాని, బుద్ధిమంతుడు కనుక మంత్రి కాస్త ఆలోచించి, చతురతతో ఇలా అన్నాడు:

"మహారాజా! నాదొక చిన్న మనవి: మా కర్తవ్యం మరిచి మేము జూదంలో పడిపోవటం తప్పే. కాని, ప్రభువులు ఒక్క విషయం యోచించవలసి వుంది. అదేమిటంటే–రాజు, ప్రజలకు తండ్రివంటివాడు కావటంవల్ల రాజ్యాన్ని రక్షించవలసిన బాధ్యత మా యిద్దరికన్న ప్రభువులకే ఎక్కువకదా? ఆలోచించండి!"

ఈ మాటలు విని రాజు తెల్లబోయాడు. వెంటనే వారి తప్పులు క్షమించాం అని ప్రకటించాడు. ఇకముందు ఎవ్వరూ ఈవిధంగా చదరంగం ఆడటానికి వీలులేదని కూడా శాసించాడు.

'ఐతే మన రాజ్యంలో సంతోషం ఎలా కలుగుతుంది మహారాజా?' అని సంశయం వెలిబుచ్చాడు మంత్రి.

రాజుకి ఒక మంచి ఆలోచన తట్టింది. ఆ ప్రకారం చేస్తే రాజ్యంలో నిత్యమూ సంతోషం వుంటుందని భావించాడు.

మరునాడే యువరాజుకి పట్టం కట్టారు. శశాంకుడు భార్యతోకూడా అంతఃపురంలో చదరంగం ఆడుకొంటూ కూర్చున్నాడు. పరిపాలన చక్కగా నడుస్తున్నది. రాజ్యంలో పూర్తిఐన సంతోషం ఏర్పడింది. ఈవిధంగా రాజు మనస్సుకీ శాంతి కలిగింది.






# బోయవాడి నిబ్బరం

ఒకానొకప్పుడు పార్వతీపరమేశ్వరులు కాశీ పట్టణంమీదుగా విహారం బయలుదేరారు. అక్కడ వేలకొద్దీ ప్రజలు గంగానదిలో స్నానం చేస్తున్నారు. కొందరు విశ్వేశ్వరుణ్ణి దర్శించుకొంటున్నారు, కానుకలు సమర్పిస్తున్నారు, భజనలు చేస్తున్నారు.

ఇదంతా చూచి, పార్వతీదేవి భర్తతో: "నాథా!—ప్రతిరోజూ నిన్ను సేవించుకోటానికి ఇందరు భక్తులు ఈ కాశీపట్టణానికి వస్తున్నారుకదా, వీరంతా నీ సాన్నిధ్యం పొందేవారేనా? ఇందరూ కైలాసం చేరుకుంటే కైలాసం సరిపోతుందా?" అని అడిగింది.

అందుకు పరమశివుడు: "ఓసి అమాయకురాలా! కాశీకి వచ్చిన ప్రతివాడూ కైలాసం చేరుకుంటాడనేనా నీ ఉద్దేశం?– పుణ్యక్షేత్రాలు దర్శించకపోయినా నా సాన్నిధ్యం పొందవచ్చును. నా సన్నిధికి రాగలవాడు ఎటువంటివాడు ఐవుండాలో ప్రత్యక్షంగా చూపిస్తాను" అన్నాడు.

* * *

పార్వతీ పరమేశ్వరులు వృద్ధదంపతుల రూపంలో విశ్వేశ్వరుని దేవాలయం దగ్గిరికి చేరుకుని అక్కడ ఒక మర్రిచెట్టుకింద కూర్చున్నారు. అవసానదశలోవున్న వృద్ధుడిలా శివుడు బాధపడసాగాడు.

విశ్వేశ్వరుని దర్శనంకోసం ఎందరో భక్తులు ఎక్కడెక్కడినుంచో వస్తూవున్నారు. వారిలో కొందరు ఈ వృద్ధదంపతులకేసి చూడనేలేదు. మరికొందరు చూచి చీదరించుకు వెళ్ళిపోయారు.

ఇంతలో ఒక యాత్రికుడు వచ్చాడు. అతణ్ణిచూచి వృద్ధురాలు "బాబూ!—ఇతడు నా భర్త. చావటానికి సిద్ధంగా వున్నాడు కాసిన్ని నీళ్ళు గొంతుకలో పోసి పుణ్యం కట్టుకోండి" అని ప్రార్థించింది.

వి. మార్కండేయరావు




అందుకు ఆ యాత్రికుడు విసుక్కొని "ఎక్కడ చూసినా ముష్టివాళ్ళే. మీకు అందరికీ నీళ్ళు పోస్తూ కూర్చుంటే ఇక అయినట్టే. బోలెడు డబ్బు ఖర్చుచేసుకుని ఇక్కడికి వచ్చినది మీ గొంతుకల్లో నీళ్ళు పోయడానికేనా?" అంటూ వెళ్ళిపోయాడు.

మరి కాస్తసేపటికి మరొక పరమభక్తుడి లాంటివాడు వచ్చాడు. వృద్ధురాలు కోరడంతోటే దయతలచి, గంగాతీర్థం పోయబోయాడు. కాని, అంతలోకే వృద్ధురాలు "ఇదిగో నాయనా!—నువ్వు నీళ్ళు పోసి నా భర్త దాహంతీర్చటానికి ముందు ఒక నియమం వున్నది, విను: నువు జ్ఞానం వచ్చినతర్వాత ఏ పాపమూ చేయకుండా వుండాలి. అలాగయితేనే తీర్థం పొయ్యి—అబద్ధం ఆడకు—నువ్వు అబద్ధం ఆడినట్టయితే నా భర్త చనిపోతాడు. ఆ పాపం నీకు చుట్టుకుంటుంది" అని చెప్పింది.

ఈ మాటలు విని, "పూటకి గతిలేని వాళ్ళు, వీళ్లకి నియమం ఒకటా? అయినా, ఒకవేళ ఈ ముసలివాడు చస్తే ఆ పాపం నిష్కారణంగా నన్ను చుట్టుకుంటుందే. తీరికూర్చుని వీళ్లకి ఉపకారం చెయ్యబోయి అపకారం కొనితెచ్చుకోవడమవుతుందే" అని విసుక్కుంటూ ఆ భక్తవేషధారి తనదారిని తను వెళ్ళి పోయాడు. మళ్ళా కొన్ని గంటలవరకూ ఏ తీర్థయాత్రికుడూ ఆ వృద్ధులకు సాయం చెయ్యడానికి దగ్గరకు రానేలేదు—

తరవాత ఒక బోయవాడు విశ్వేశ్వరుణ్ణి దర్శించుకుని ఆ దారిని వచ్చాడు. వృద్ధురాలి దీనాలాపన విని వృద్ధుడి గొంతుకలో గంగాజలం పొయ్యబోయాడు. కాని, వృద్ధురాలి వింతషరతు విని వాడూ మొదట ఆశ్చర్య పోయాడు.

కాని మరొకసారి ఆ వృద్ధుల ముఖాలలోకి చూశాడు. వెంటనే వాడికి ఏదో ఒక దివ్యతేజస్సు కనబడుతున్నట్టు తోచింది.

బోయవాడు యిలా అనుకున్నాడు—
'పుట్టినప్పటినుంచీ ప్రతి మానవుడూ ఏదో పాపం చేస్తూనే వుంటాడు. పాపం చెయ్యని వాడంటూ ఎవడూ లేడు. నేను బోయలలో పుట్టాను. నా వృత్తి జీవహింస. భగవంతుడు నాకు కల్పించిన వృత్తే అది. ఈశ్వరుడు కల్పించిన వృత్తికి నెను బాధ్యుణ్ణికాదుకదా! అయితే, ఈ వృదులు సామాన్యులుగా కనబడరు. సామాన్యులైతే ఈ దివ్యతేజస్సు ఉండదు. వీరు నిశ్చయంగా ఎవరో మహనీయులు.

'పోతే—ఇప్పటివరకు నేను చేసివున్న పాపాలు తొంభైతొమ్మిది! ఈ దంపతులు సామాన్య మానవులే ఐతే నేను పోసే తీర్థం వల్ల ఈ వృద్ధుడు చనిపోతాడు. నేను చేసిన తొంభైతొమ్మిది పాపాలతో కలసి ఇది నూరవది అవుతుంది. అలా కాక వీరు ఎవరో మహనీయులే అయితే నా పాపాలన్నీ హరించిపోయి, తరిస్తాను' అనుకొన్నాడు.

ఈ నిశ్చయంతో వాడు వృద్ధుడి నోరు తెరిచి, గంగాతీర్థం పోశాడు. ఆ క్షణమందే వృద్ధదంపతులు మాయమై వారి స్థానంలో పార్వతీపరమేశ్వరులు సాక్షాత్కరించారు.

అప్పుడు పరమేశ్వరుడు పార్వతితో: "చూచావా, ఈ బోయవాడి గుండెనిబ్బరం? వీడు నన్నే నమ్ముకొని ఉన్నాడు. పవిత్రమైన హృదయం కలిగి ఉండటంచేత తన పాపాలన్నీ మన దర్శనంవల్ల పోగొట్టుకున్నాడు. ఇటువంటివాళ్ళే కైలాసంలో ఉండటానికి అర్హులు, నిజమైన భక్తులు. కాని, ఉత్తుత్త పూజలు చేసేవాళ్ళంతా భక్తులు కారు. వాళ్ళు నా సాన్నిధ్యం పొందలేరు" అని చెప్పాడు. తరువాత బోయివాణ్ణి దీవించి అక్కడినుంచి అంతర్థానమయ్యాడు.

ఆ క్షణంలోనే బోయవాడికోసం ఒక పుష్పక విమానం వచ్చి అతణ్ణి దేవలోకానికి తీసుకుపోయింది.



# అట్టవిూది బొమ్మ

పూర్వం, ఇక్ష్వాకు వంశంలో సగరుడనే చక్రవర్తి ఉండేవాడు. ఆయనకు ఇద్దరు భార్యలు. ఒకామెకు ఒక్కగానొక్క కొడుకు 'అసమంజసుడు' అనేవాడు. వీడి దుర్మార్గం సహించలేక తండ్రి వీడిని రాజ్యంనుండి వెళ్ళగొట్టాడు. రెండవ భార్యకు అరవైవేలమంది పుత్రులు. వాళ్ళూ చాలా గర్విష్ఠులు.

సగర చక్రవర్తి ఒకప్పుడు అశ్వమేధయాగం తలపెట్టాడు. యజ్ఞాశ్వం మాయమయింది. దానిని వెతికిపట్టటానికి ఈ అరవైవేలమందీ బయల్దేరి, పాతాళ లోకం చేరుకున్నారు. అక్కడ కపిలమహర్షివద్ద ఈ అశ్వం కనపడగా, ఆయనే దొంగిలించాడని వీళ్లు గోలచేశారు. మహర్షి ఉగ్రుడై, వారిని శపించేసరికి, వాళ్ళంతా ఉన్నపాటున భస్మమైపోయారు.

చివరకు సగరచక్రవర్తికి 'అంశుమంతుడు' అనే ఒక్క మనుమడు మిగిలాడు. వానికి పట్టంకట్టి చక్రవర్తి తపస్సు చేసుకోబోయాడు. ఈ అంశుమంతుని మనుమడే భగీరథుడు. కపిలమహర్షివల్ల భస్మమైపోయిన తన ముత్తాతలకు గతులు కల్పించాలని భగీరథుడు సంకల్పించాడు.

వారికి గతులు కలగాలెనంటే పవిత్రమైన గంగాజలం వారిమీదినించి ప్రవహించాలి. ఐతే, ఆకాలమందు గంగ భూలోకమందు ఇంకా అవతరించ లేదు. అప్పుడు భగీరథుడు అనేకవేల వత్సరాలు ఘోరతపస్సు చేసి గంగా దేవిని ప్రార్థించాడు. ఆమె ప్రత్యక్షమై 'నాయనా!—నేను దిగివస్తే, నన్ను భూదేవి భరించలేదు. కనుక పరమేశ్వరుణ్ణిగురించి తపస్సుచేసి, మొట్టమొదట నా శక్తిని ఆయన భరించేటట్టు వరం పొందు' అని చెప్పి అదృశ్యమయింది.

భగీరథుడు శివునిగురించి తపస్సుచేసి, వరం పొందాడు. తరువాత గంగ దిగివచ్చి పరమేశ్వరుని తలపైన పడి, ఆయన జటాజూటంలోపలినుండి దారి చేసుకొని, భగీరథుని వెంబడే భూమిమీద ప్రవహించింది.

ఇలా గొప్ప ప్రయత్నం చేసి, గంగను పాతాళానికి కొనిపోయి, అరవైవేల మంది సగరపుత్రులకూ గతులుకల్పించాడు భగీరథుడు. దీనినిబట్టే 'భగీరథ ప్రయత్నం' అని జాతీయం ఏర్పడింది. గంగకు భాగీరథి అని పేరువచ్చింది. శివుడు గంగాధరుడయ్యాడు. ఈ గంగావతరణ కథను, వనవాసంలో ఉన్న ధర్మరాజుకు ఋషులు వినికిడిచేశారు.

# న్యాయసూత్రం




కొన్నివేల సంవత్సరాలకు పూర్వం ధర్మపాలుఁడనే రాజు ధవళగిరిరాజ్యాన్ని పరిపాలిస్తూండేవాడు. ఆయన దాన, ధర్మగుణాలలో సాటిలేనివాడనిపించుకున్నాడు. న్యాయనిర్ణయం చేయవలసివచ్చినప్పుడు 'నావాడు, యితరుడు' అనే భేదభావం ఆయనలో కొంచెమైనా కానవచ్చేదికాదు.

కంటికి కన్ను, పంటికి పన్ను - అనేదే ఆయన న్యాయసూత్రం. కీడు పొందినవాడెవడైనా, తిరిగి అదే పద్ధతిలో కీడుచేసిన వాడిపై పగ తీర్చుకొనవచ్చుననే న్యాయం ఆ రాజ్యంలో అమలులో వుండేది.

ఒకనాడు ధర్మపాలుఁడు నిండుకొలువులో వున్నాడు. మంత్రి, సామంతులంతా సుఖాసీనులైవున్నారు. రాజ్యపాలనకు సంబంధించిన ముఖ్యవిషయాలపై చర్చ జరుగుతూవుంది. ఆ సమయంలో ఒక నాగుబాము దారితప్పి కొలువులో ప్రవేశించింది.

నాగుబాము కంటపడేసరికి కొలఁవులో కలకలం బయలుదేరింది. కొందరు కత్తులు దూసి దానిని చంపేందుకు లేచినిలబడ్డారు. కాని తండ్రి పక్కనే కూర్చునివున్న యువరాజు అందరినీ వారించి ఖడ్గంతో నాగుబామును రెండుతుండెములుగా నరికాడు.

అలా నరికినప్పటికీ, తల వున్న మొండెముతో నాగుబాము అక్కడినుంచి పారిపోయి పుట్ట చేరింది. నాగుభార్య, భర్తకు కలిగిన ఈ విపత్తు చూసి శోకించ సాగింది. అప్పుడు నాగు తను దారితప్పి కొలువులోకి వెళ్తే, తనకు యువరాజు చేసిన అపకారం గురించి తెలియ పరిచి—

ఎం. ఏబెల్, ఎం. ఏ.




"ఈ రాజ్యంలోని కట్టడి నీకు తెలుసు గదా ? ఆ ప్రకారమే రాజు న్యాయవిచారణ చేసి పుత్రుడికి శిక్ష విధిస్తాడు. ఆ కట్టడి వల్ల నేరస్థుడైన యువరాజును నువ్వు కరచి చంపవచ్చును. కాని, ముందుగా రాజుకుమాత్రం న్యాయవిచారణ జరిపే అవకాశం యివ్వవలసింది. అంతే కాని అనవసరంగా తొందరపడి యువరాజుకు హాని కలిగించవద్దు !" అని భార్యతో చెప్పి ప్రాణం విడిచాడు.

నాగుభార్య ఆ రాత్రి కోట ప్రవేశించి యువరాజు పడకగది చేరింది. గాఢనిద్రలో వున్న యువరాజు కంఠానికి చుటుకుంది. భయకంపితుడైన యువరాజు మేలుకొని సహాయంకోసం కేకలుపెటాడు.

కేకలు విని దాసదాసీలంతా అక్కడికి పరుగెత్తుకవచ్చారు. కాని ఎవ్వరికీ నాగు భార్యను చంపటం ఎలాగో తెలియలేదు. యువరాజు కంఠాన్ని గట్టిగా చుట్టపెట్టు కొనివున్న ఆ పామును కొట్టాలంటే, యువ రాజుకూ దెబ్బ తగులుతుంది. అలాంటి స్థితిలో ఏమి చేయటానికీ వాళ్లకు పాలుపోక కంగారుపడసాగారు.

అంతలో నాగుభార్య "ముందు రాజు గారిని పిలుచుకురండి, న్యాయ విచారణ జరగాలి. ఒకవేళ మీలో ఎవరైనా నన్ను చంప యత్నిస్తే యువరాజును కాటు వేస్తాను. జాగ్రత్త!" అంటూ హెచ్చరించింది.

అంతలో రాజుగారు అక్కడకు రానే వచ్చారు. నాగుభార్య తన భర్తమరణాన్ని గురించి రాజుతో చెప్పి—

"నా భర్త ఎవరికీ హాని తలపెట్టలేదు. ఆయనదారిన ఆయన పోతున్నాడు. కాని యువరాజు అన్యాయంగా ఆయనను చంపి నాకు వైధవ్యం కలిగించాడు. ఈ రాజ్య న్యాయసూత్రంప్రకారం నేను యువరాజును చంపి, ఆయనభార్యకు వైధవ్యం కలిగించ వచ్చునుగదా ?" అన్నది దీనంగా.

నాగుభార్య అలా అనేసరికి రాజు చాలా వ్యాకులపడ్డాడు. న్యాయచట్టం ప్రకారం, అన్యాయంగా నాగుబామును చంపివేసి ఈమెకు వైధవ్యం కలిగించిన యువరాజు శిక్షార్హుడే అవుతాడు. కాని తనకు అతడు ఒక్కగానొక్క కొడుకు! ఈ విపత్తునుంచి బైటపడటం ఎలా?

చేసేదిఏమీలేక రాజు ఇరువురు న్యాయమూర్తులను పిలిపించాడు. వాళ్ళు నాగుభార్య చెప్పినదంతా విన్నారు. విన్నతరవాత ఒక న్యాయమూర్తి యిలా చెప్పాడు:

"మహారాజా! కంటికి కన్ను, పంటికి పన్ను—అన్న మన రాజ్య న్యాయచట్టం అందరికీ తెలిసిందే! కనుక యువరాజువల్ల అపకారం పొందిన నాగుబాము, తన భార్యకు కలిగిన వైధవ్యబాధనే యువరాణీ గారికి కూడా కలిగించవచ్చు!"

నాగుభార్య ఈ తీర్పు విని అనంగీకారంగా తల ఆడించింది.

"ఇది ఏ న్యాయశాస్త్రమూ అంగీకరించని తీర్పు. కేవలం నన్ను మోసపుచ్చటానికి, ఈ న్యాయమూర్తులవారు చేస్తున్న ప్రయత్నం. చచ్చిపోయిన నాభర్త ఏవిధంగా యువరాజు భార్యకు వైధవ్యం కలిగించగలడు?" అని అడిగింది.

నాగుభార్య అలా ప్రశ్నించేసరికి ఆ న్యాయమూర్తి మరి మాటాడలేకపోయాడు. అప్పుడు రెండవ న్యాయమూర్తి యిలా



అన్నాడు: "నాగుభార్య చెప్పినదానిలో సత్యం లేకపోలేదు; అయినా యిక్కడ ఒక ధర్మసందేహం కలుగుతూవుంది" అంటూ "అమ్మా, నీకు సంతానం ఎందరు?" అని నాగుభార్యను అడిగాడు.

"నాకు ఐదుగురు పుత్రులు!" అన్నది నాగుభార్య కళ్ళ నీళ్ళు పెట్టుకొని.

"అలాగా పాపం! యువరాజు నిన్ను ఐదుగురు పుత్రులు వున్న వితంతువుగా చేశాడన్నమాట! కనుక నువ్వా ఆయన భార్యను ఐదుగురు పుత్రులున్న వితంతువుగానే చేయాలి! అప్పుడుగాని న్యాయసూత్రాన్ని అనుసరించి శిక్ష విధించినట్టు కాదు. అవునుగదా?" అని అడిగాడు.

అందుకు నాగుభార్య "అవును, అవును!" అన్నది అనుమానిస్తూ.

అప్పుడు న్యాయమూర్తి యిలా చెప్పాడు: "కనుక నువ్వ కొంతకాలం వేచివుండాలి. ఇప్పుడు యువరాణికి యిద్దరే పుత్రులు. ఆమెకూడా ఐదుగురు పుత్రుల తల్లి అయిన తరవాత నువ్వ నిరభ్యంతరంగా యువరాజుమీద పగతీర్చుకోవచ్చు."

ఈ తీర్పు న్యాయసూత్రానికి అనుగుణంగానే వుందని నాగుభార్య అంగీకరించక తప్పలేదు. అందువల్ల ఆమె రాజును ఒక్క కోర్కె కోరింది. యువరాణికి ఐదవ సంతానం కలగగానే తనకు ఆ వర్తమానం పంపమన్నది.

న్యాయశీలి అయినరాజు సరే అన్నాడు. కాని యువరాణికి ఆ తరవాత సంతానమే కలగలేదు. నాగుభార్య మాత్రం, ఆ దంపతులు ఉద్యానవనంలోకి వచ్చినప్పుడల్లా తన పుట్టలోనుంచి తొంగిచూసేది.

ఎంతకాలం జరిగినా, వాళ్లవెంట యిద్దరు పిల్లలకంటె ఎక్కువ కనబడలేదు. యిక నా పగ తీరటం ఎలా? అనుకొనేది నాగుభార్య. కొంతకాలానికి తనపగ తీరకుండానే మరణించింది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1954 సెప్టెంబరు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ జూలై 7-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మంటికి అరుగు | రెండవ ఫోటో : మింటికి ఎగురు

పంపినవారు : నండూరి విజయలక్ష్మి, C/o ఎస్. సత్యనారాయణమూర్తిగారు, B. Sc., శెనగపప్పు బజారు, ఏలూరు (ప॥ గోదావరి)

బహుమతిమొత్తం రు. 10/ ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# రత్నగోళం (అట్టచివరి బొమ్మ) - 3

అయితే—తుఫాను ఎలావచ్చి విజృంభించిందో అలానే క్రమంగా తగ్గిపోయింది. మబ్బులు విడినై. సముద్రుడు శాంతించాడు. సూర్యభగవానుడు దర్శన మిచ్చాడు. బతికామురా బాబూ అనుకొన్నాడు కప్తాను. అందరూ సంతోషించారు. కాని, ఉన్నట్టేవుండి, రత్నగోళం దాచిన బంగారు బరిణెకు కాపలా కాసే నావికుడు 'బాబూ!—బరిణె పోయింది ... మాయమైపోయింది!—' అని కంగారుపడుతూ చెప్పాడు కప్తానుతో.

'ఏమిటీ! ప్రాణసమాన మైన ఆ బరిణె పోయిందా? మాయమైపోయిందా? రండి, ఎక్కడకైనా కొట్టుకపోయిందేమో వెతకండి!' అంటూ కప్తాను నావికు లందరినీ హెచ్చరించాడు. దశదిశలా వారు గాలించారు. వాళ్లు వెతకని ప్రదేశం లేదు. కాని, దాని జాడే కనబడలేదు. నిరాశతో కప్తాను కుంగిపోయాడు.

కొంచెంసేపటిలోనే కప్తానుకు విచారంతొలగి—'ఆఁ! ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఈ సముద్రంలో వుండే భూతసర్పమే మనకు ఈ తుఫాను బాధ కల్పించింది. ఏమంటే, అసలీ బంగారు బరిణెలో వుండే రత్నగోళం దానిదేనట, దాని కోటలో ఉండేదట. అది కనబడకపోయేసరికి, ఆ క్షణంనించీ భూతసర్పం తెగవెతుకుతున్నదట. ఇప్పుడు అదునుచూచి అది తన వస్తువును చిక్కించుకొన్నదన్నమాట' అన్నాడు.

పక్కనే వున్న ఒక వృద్ధ నావికుడు ఇలా చెప్పాడు: 'ఈ రత్నగోళాన్ని గురించి అనాదినించీ వస్తున్న కథ నాకు తెలుసు—పూర్వకాలమందు, సముద్రంలో వుండే ఈ భూతసర్పం ఒక మత్స్యకన్యను వరించింది. ఆమెకోసం చక్కటి ముత్యాలభవనం కట్టి, అపరూపమైన ఈ రత్నగోళాన్ని కానుకగా ఇచ్చింది. చాలాకాలం మత్స్యకన్య భూతసర్పం కట్టియిచ్చిన ముత్యాల కోటలోనే ఉంటూ, రత్నగోళాన్ని జాగ్రత్తగా దాచుకొన్నది.

ఒకప్పుడు, అనాటి చీనాదేశపు చక్రవర్తి ఓడమీద వెళుతూ ఆ మత్స్యకన్యను వరించాడు. అప్పుడు మత్స్యకన్య ఆలోచించి, చక్రవర్తిని సంతోష పెట్టేందుకు తనవద్దనున్న ఈ రత్నగోళాన్ని కానుకగా ఇచ్చింది. నాటినించీ తన రత్నగోళంకొసం భూతసర్పం వెతుకులాడుతూనేవుంది.' ఈ గాథ వినటంతో కప్తానుకు వేగిరపాటు కలిగింది.




# గొప్ప యోగం

చాలా కాలంకిందట ఒకానొక పల్లెటూరిలో కొమరయ్య అనే పశువులకాపరి ఒకడు ఉండేవాడు. అతడు యువకుడు, మంచి ధైర్యశాలి. ఈ కారణంచేత అతగాడి ఆలోచన ఎప్పుడూ దేశాలు చూడటంమీదా, గొప్ప గొప్ప యుద్ధాల్లో పాల్గొనటంమీదా ఉంటూ వుండేది.

ఒకనాడు కొమరయ్య యిలాగే ఆలోచిస్తూ పశువులను మేతకు వదిలి ఒక చెట్టుకింద పడుకున్నాడు. కాసేపటికల్లా అతడికి నిద్రపట్టింది. ఇక ఆ నిద్రలో చిత్ర విచిత్రమైన కల వచ్చింది:

తను ఒక కొండ ఎక్కుతున్నట్టూ, కొండ కొస చేరేసరికి ఒక సింహాసనంలో తను కూర్చున్నట్టూ. అలా సింహాసనంలో కూర్చున్న తన పక్కనే రాణీవేషంలో వున్న ఒక సుందరికూడా కనిపించింది. ఇదేమిటా అని ఆశ్చర్యపోతూ అతడు తల తడిమి చూసుకునేసరికి నెత్తిమీద ఒక రత్నకిరీటం చేతికి తగిలింది.

"నేను రాజును, రాజును!" అంటూ నిద్రలోనుంచి కళ్లు తెరిచి చుట్టూ కలయ చూశాడు కొమరయ్య. అంతా వట్టిదే అని అతడికి తెలిసిపోయింది. దూరంగా మేస్తూవున్న పశువులూ, చెట్టుకింద తనూ. "ఎంత మంచి కల వచ్చింది!" అనుకొంటూ ఆలోచనలో పడ్డాడు కొమరయ్య.

ఆ మరుసటి రోజుకూడా అదే కల వచ్చింది. దానితో కొమరయ్యకు కల నిజమవుతుందేమో అనిపించింది. 'రేపూ సరీగా యిలాగే కల వస్తే ఆ కనబడే కొండ ఎక్కుతాను. ఏమో, ఆ కొండ అవతల వున్న బాలాభిపుర రాజ్యానికి నేను రాజును అవుతానేమో!' అనుకున్నాడు కొమరయ్య.

ఆ మూడవ రోజునకూడా కొమరయ్యకు అదే కల వచ్చింది. ఇక యీ గొడ్లకాపరి

కె. విష్ణురావు



పని లాభంలేదనుకున్నాడు. చెట్టుకింద నుంచి లేచి కొండకేసి బయలుదేరాడు. సాయంకాలానికల్లా ఎలా అయితేనేం శ్రమ పడి కొండపైకి చేరాడు. కాని అక్కడ సింహాసనం లేదు, రాణీ లేదు. అయినా కొమరయ్యి ఎంతమాత్రం నిరుత్సాహపడ లేదు. చీకటి పడేసరికి కొండ దిగి బాలాభి పుర రాజ్యంలో ప్రవేశించాడు.

అప్పటికి కొమరయ్యకు బాగా ఆకలి వేసింది. చుట్టుపట్ల ఎక్కడైనా పల్లెగాని, జనసంచారంగాని కంటబడుతుందేమో అని చూశాడు. చీకటీ, కీకారణ్యం తప్ప మరేం కనబడలేదు. సరే, ఈ రాత్రికి యిక్కడే చెట్లకింద పడుకుని, తెల్లవారి ఏదైనా గ్రామం చేరుదామనుకున్నాడు.

కొమరయ్య అక్కడ వున్న చెట్టుకింద కాళ్ళు ముడుచుకొని పడుకున్నాడు. ఆకలి దహించుకుపోవటంచేత నిద్ర సరిగా పట్టింది కాదు. అంతలో ఆ పక్కనే గుర్రాల సకిలింపూ నలుగురైదుగురు మనుషులు మాట్లాడుకోవటం అతడి చెవిని పడింది.

కొమరయ్య చెవులు రిక్కించి వాళ్ళ మాటలు వినసాగాడు. అక్కడికి కొంచెం దూరంలో చెట్లచాటున ఒక పాడుపడిన యిల్లు వుందని వాళ్ల సంభాషణనిబట్టి గ్రహించాడు. ఆ అశ్వికులు యీ రాత్రికి ఆ పాడుపడిన కొంపలో తల దాచుకుందా మనుకుంటున్నారు. కొమరయ్య చెట్టుకింది నుంచి లేచి చడీచప్పుడూ లేకుండా వాళ్లని వెంబడించాడు.

కొద్దిసేపటికి వాళ్లు ఆ పాడుపడిన యింటికి చేరారు. అందరూ గుర్రాలు దిగి, యింట్లో ప్రవేశించి దుప్పట్లు పరుచుకొని పడుకున్నారు. కొమరయ్య, ఏంచేయుటమా అని ఆలోచిస్తూ ఆ యింటి గోడపక్కనే చీకట్లో నిలబడ్డాడు. వాళ్ళు దొంగలేమో అన్నభయంకూడా కలిగింది కొమరయ్యకు. కాసేపటికల్లా కొమరయ్య అనుమానించింది



నిజమే అని తేలింది. వాళ్ళలో ఒకడు అధికార స్వరంతో యిలా అడిగాడు :

"ఒరే రాబందూ! యివ్వాళ నువు ఏం సంపాదించావ్ ?" అందుకు బదులుగా ఆ రాబందు పేరు గలవాడు—

"అయ్యా, యివ్వాళ కలలోకూడా కన పడని గొప్ప వస్తువు ఒకటి సంపాదించాను. వాడెవడో పెద్ద షావుకారులా వున్నాడు. వాడి కోటు దొంగిలించాను. మనకు ధనం కావా లనుకున్నప్పుడల్లా ఆ కోటు జేబులు తిరగ వేస్తేసరి, మొహిరీలు రాలతై" అన్నాడు. 'భలే' అని మెచ్చుకొన్నాడు వాళ్ళ నాయ కుడు. తరవాత—

"అరే గుంటనక్కా! నీ సంపాదన ఏమిటి?" అన్నాడు. అందుకు గుంటనక్క పేరుగలవాడు—

"అయ్యా, యివ్వాళ అదృష్టంపండి ఒక సైన్యనాయకుడు ప్రాణాపాయస్థితిలో నాకంటపడ్డాడు. అతడి ముక్కోణాల శిరో వేష్టం కాజేశాను. అది తలమీదధరిస్తే— కావాలన్నప్పుడల్లా మూడు దిశలకేసి అం బులవర్షం కురిపిస్తుంది!" అన్నాడు.

"భలే! నువ్వోయ్ నిజమైన గుంట నక్కవి. సరే, నువ్వోయ్ భల్లూకం! నీ సంపాదన?" అన్నాడు దొంగల నాయకుడు.

"అయ్యా, నేను ఒక కత్తి సంపాదిం చాను. మనకు కావాలనుకున్నప్పుడు దాన్ని భూమిమీద పొడిస్తే—తడవకు వెయ్యి మంది సైనికులు పుట్టుకొస్తారు!" అన్నాడు భల్లూకం.

"చాలా బావుంది! వాటిని ఆ గోడకు జాగ్రత్తగా తగిలించి యిక నిద్రపొండి. తెల్లవారి మనకు చాలా పనులున్నాయి" అన్నాడు దొంగల నాయకుడు.

కొమరయ్య వాళ్ళ సంభాషణ విన్నాడు. దొంగలు నిద్రపోగానే, గోడకు తగిలించి వున్న కోటూ, కత్తీ, శిరోవేష్టం మెల్లగా తీసుకుని అక్కడినుంచి పారిపోయాడు



రెండు మూడు రోజులకల్లా బాలాభిపురం చేరి, రాజదర్శనంకోసం అడిగాడు.

"నువ్వెవరివి? రాజదర్శనం అంత తేలిక అనుకున్నావా?" అన్నారు కోట కాపలావాళ్ళు.

"ఓహో అలాగా! ఐతే మీరు నా పేరే వినలేదన్నమాట? మహావీరుడు కొమర సింహుడు తెలియదా?" అన్నాడు కొమ రయ్యా కళ్ళెర్రచేస్తూ—

"మీరు... మీరు మహావీరులైన కొమర సింహులా! రండి, దయచేయండి!" అంటూ కాపలావాళ్ళు కొమరయ్యాను రాజు దగ్గిరకు తీసుకుపోయారు. ఆ సమయంలో సింహాసనం పక్కన రాజకుమార్తెకూడా వుంది. ఆమెను చూడగానే కొమ రయ్యాకు తన కల నిజం అవుతున్నట్టు తోచింది. కిరీటం తప్పితే, ఆమె అచ్చుగా అతడు కలలో చూసిన రాణీలాగేవుంది.

రాజు, కొమరయ్యాను చూసి "నీకేం కావాలి?" అని అడిగాడు.

కొమరయ్యా తనదగ్గిరవున్న శిరోవేష్ఠం, కత్తిసంగతిమాత్రం చెప్పాడు. అనేక యుద్ధాల్లో ఆరితేరిన వీరుణ్ణి అని తెలియ పరిచాడు.

"కావాలంటే, యీ ప్రపంచాన్నే జయించి మీకు పట్టాభిషేకం జరపగలను!" అన్నాడు కొమరయ్యా ఆఖరికి.

రాజు పరమానందం పొందాడు. "నువ్వు ప్రపంచాన్ని తరవాత జయించ వచ్చు, చేతనైతే ముందు నా రాజ్యంమీదికి పెద్దసేనతో దండెత్తివచ్చిన గాంధారరాజును ఓడించు!" అన్నాడు రాజు.

"అదెంత పని! కాని, నా కోర్కె ఒకటి వుంది. నేను గాంధారరాజును జయించిన తరవాత, మీ కుమార్తెను నాకిచ్చి వివాహం చేస్తారా?" అని అడిగాడు కొమరయ్యా నదురూ బెదురూ లేకుండా. అందుకు రాజు నవ్వి 'సరే' అన్నాడు. ఆయనకు గాంధార



రాజువల్ల తన రాజరికానికే పెద్దముప్పు వచ్చేట్టు కనబడింది. పైగా అంత బల శాలిని జయించినవాడికి తన కుమార్తెను యిచ్చి వివాహం చేయటం అన్నివిధాలా తనకే గౌరవ ప్రదం అనుకున్నాడు.

యిక కొమరయ్యా కొద్దిమంది సైనికులను వెంటబెట్టుకుని వెళ్లి గాంధార రాజును ఎదిరించాడు. ఘోర యుద్ధం జరిగింది. ఇరుపక్షాలలోనూ చాలా మంది సైనికులు మరణించారు.

కొమరయ్యా, తనకు సైనికుల అవసరం వున్నదని తోచినప్పుడల్లా కత్తిని భూమిలో గుచ్చి వెయ్యిమంది సైనికులను రప్పించే వాడు. పైగా అతడి శిరోవేష్టంనుంచి వెడలిన బాణాలు శత్రుసైన్యాన్ని చీకాకు పరిచి హతమార్చ సాగినై.

సాయంత్రం అయేసరికి చావగా మిగి లిన కొద్దిమంది సైనికులతో గాంధారరాజు పారిపోయాడు. విజయుడైన కొమరయ్యా జయజయధ్వానాలు చేస్తూన్న సైనికులు వెంటరాగా సరాసరి బాలాభిపుర రాజు దగ్గరకు వెళ్ళాడు.

రాజు, కొమరయ్యాను అభినందించాడు. "కొమరసింహా! నీకన్న వీరుడైన అల్లుడు నాకు దొరకడు. నేను వృద్ధుణ్ణి అయాను కనక, ఇప్పుడే నిన్ను బాలాభిపుర రాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేస్తున్నాను" అన్నాడు మందహాసం చేస్తూ.

కొమరయ్యాకు, రాజకుమార్తెతో వైభ వంగా వివాహం జరిగింది. తరవాత రాజ్యాభి షిక్తుడుకూడా అయ్యాడు. సింహాసనంమీద అతడు కూర్చున్నప్పుడు, పక్కనే రాకుమార్తె కిరీటం ధరించి కూర్చున్నది.

'నేను కలలోచూచిన రాణీయే యీమె!' అనుకొని కొమరయ్యా మురిసిపోయాడు.

ఇంతగొప్ప వీరుణ్ణి పెళ్లాడగలిగిన తన అదృష్టానికి రాజకుమార్తెకూడా చాలా సంతోషించింది.





# బొజ్జ బరువు

బి. వి. ప్రసాదరావు

ఆ ఊరికెల్ల
ధనికుం డాతడు
నిత్య రోగమయ
పీడితుడు.

తింటేనా ఆయాసం
తినకుంటే నీరసం
కూర్చుంటే లేవలేడు
లేస్తే కూర్చొనలేడు.

పట్టుపరుపు మెత్తలలో
దొరలలేని పెద్ద పొట్ట
ముందు వెనుక కదలలేక
మందముగా పడియుండును.

డాక్టర్లొచ్చి, మందులు వేసీ
చేశారెన్నో ఇంజక్షన్లు
పడ్డా రింతింతనరాని పాట్లు;
రోగి బాధ తగ్గలేదు
పొట్ట బరువు తీయలేదు.

అంత నొక్క వైద్యుడొచ్చి
'తీయటి మందులతో
అయ్యా, నే కుదురుస్తా
ఎట్టి గడ్డు రోగమైన
చిటిక వేసినంతటిలో.'
అనుచు నారంభము చేసె
మచ్చులేని పటువైద్యం.

ఒక్కనాటి సాయంత్రము
కడు వినయము ఉప్పతిల్ల
ధనికుని సన్నిధి కేగి
విన్నవించె వైద్యరాజు :

'అయ్యా, పోదం ఒకసారి
బాగుండును సాయంత్రం షికారు
కలిగించును ఎంతో హుషారు'
అనగ ధనికు 'డటులే' యనె.

గుఱ్ఱాల సారటెక్కి
పల్లె విడిచి పోసాగిరి
ఊరు దాటి ఏరు దాటి
రైలుక్రాసు గేటు దాటి
పదకొండవ మైలురాయి
పదిలంగా తరలిపోవ
ఊహకన్న వేగముగా
హయములు పరుగిడగా
వైద్యుండే రథము నడపె.

బండినంత వెనుక తిప్పి
దండడిగా తోలుచుండ



మాయకారి వైద్యరాజు
మెల్లగాను జారవిడిచె
చేతిలోని చురుకు కొరడ
చిత్రముగా నవ్వుకొనుచు.

'అయ్యయ్యో పడిపోయెను
గుజ్జాలుండవు దిగితే
బాబూ, మంచివారు మీరు
దిగి అందుకోండి కొరడ'
అనుచు కోరె సాహసముతో.

మారుమాట చెప్పలేక
దిగిపోయెను ఆ ధనికుడు
రెండడుగులు వెనుక వేయ,
నంతలోనే తుర్రుమనెను
దౌడుతీసి జోడుగుర్రాల్.

'అయ్యో, అయ్యో! అంతా మోసం'
అంటూ అరచెను ధనికుం డంతట
ఆశలు తీరి అసహాయుండై
పరిపరివిధాల పరితపించెను.

'ఇంకెక్కడి మన ఊరు
ఇంటిదోవ పట్టెదను
ఇచట నున్న నడుదారి
గడవరాదు ఈ రాతిరి'

అనుచు నంత నా ధనికుడు
అయానం పట్టలేక
అడుగులోన అడుగు పెట్టి





నడచుచుండ అతని పొట్ట
ముడతలు పడిపోవసాగె.

నడువ నడువ పొట్టంతా
కరిగిపోయె, కరకరమని
ఆకలేసె, అమ్మయ్యో!
అంతటి ఆకలి పాపం
ఎరుగడాత డేవేళల.

'ఆకలి ఆకలి' అంటూ
ఇంటికొచ్చి వెను వెంటనె
ఆరగించె ఆప్యాయముతో
'బలే బలే!' లొట్టలేస్తూ.

నడువనడువ కలుగు శ్రమయు
చవులుగొలుపు పదార్థములు
తిమ్మిరెత్తు మత్తుగొలుప
హాయిగ నిదురించె నతడు.

తెల్లవారె, ఊరిప్రజలు
తెల్లబోవ ధనికవరుడు
తేలికగా నడయాడె నపుడు
తీరని ఉత్సాహంతో;
కులాసతో కొలువుతీర్చి
కొత్తవైద్యు పిలువనంపె.

'అయ్యా, నీ గొప్ప ఋణం
తీర్చగలనె ఈ జన్మలో?'
అనుచు ఎన్నివిధముల నా
వైద్యవరుని సత్కరించె.




పూర్వం, నేపాళదేశానికి సమీపంలో శాక్య రాజ్యం ఉండేది. శాక్యరాజ్యానికి ముఖ్య పట్టణం కపిలవస్తునగరం. ఈ శాక్యులు ఆనాటి కోసలదేశపు రాజయిన ప్రసేన జిత్తుకు లోబడిఉండేవాళ్ళు. అలా లోబడి వున్నప్పటికీ, జాతిగౌరవం పాటించేస్వభావం కలవాళ్ళు కనుక, ఇతర జాతులతో వివాహ సంబంధాలు పెట్టుకొనేవారు కాదు.

కోసలరాజుకు బుద్ధభగవానుడంటే అపరిమితమైన భక్తి. బుద్ధుడు శాక్యవంశస్థుడు కావటంచేత, భగవానునితో ఇంకా దగ్గరసంబంధం పెట్టుకోవాలనే సంకల్పంతో శాక్యవంశ స్త్రీనే తన పట్టపు రాణిగా చేసుకోవాలని కోసలరాజు ప్రసేనజిత్తుడు నిశ్చయించుకొన్నాడు.

తన నిశ్చయాన్ని దూతలద్వారా శాక్యులకు తెలియచేసి, కన్యాదానం చేయమని కోరాడు. శాక్యులకు గట్టి చిక్కు వచ్చి పడింది. కోసలరాజు ఇష్టప్రకారం చేయక పోతే తమకు నాశనం తప్పదు. చేవామంటే వారి సంప్రదాయానికి విరుద్ధం. సభలు చేశారు. చర్చలు, వాదోపవాదాలూ జరిగినై.

అప్పుడు 'మహానామ' అనే అతడు 'మీరేమీ విచారించకండి. నా కుమార్తె ఐన 'వాసవక్షత్రియ' దాసీకి పుట్టిన పిల్ల. లక్షణవతి. ఆమె శాక్యయువతే అని చెప్పి, కోసల రాజువద్దకు పంపుదాం' అని చెప్పాడు. ఇందుకు అందరూ వప్పుకున్నారు. ఆపద తొలగింది కదా అని సంతోషించారు.

కోసలరాజ్యపు దూతలను మహానామ పిలిచి 'మేము కన్యాదానం చేస్తున్నాం. మీరు ఈ అమ్మాయిని మీ దేశానికి తీసుక పోవచ్చును' అని చెప్పాడు. ఐతే, వంశ మర్యాదలలో శాక్యులు చాలా పట్టుదల కలవారని దూతలకు తెలుసును. ఇప్పుడు వారు ఇలా సులభంగా వప్పుకోవటంతోనే

వి. లక్ష్మీప్రసన్న



వాళ్ళకు సందేహం కలిగింది. 'ఈ కన్య శాక్యకన్య ఐవుండదు. తమను మోసగిస్తు న్నారు' అని దూతలు అనుమానించారు.

'సరే. మీతో పాటు ఒక కంచంలో భోజనం చేసే అమ్మాయి అయితేనే మేము తీసుకువెళతాం. లేకపోతే లేదు' అని దూతలు పరీక్ష పెట్టారు. శాక్యులకు మళ్ళీ చిక్కువచ్చింది. మళ్ళీ ఆలోచించారు. కోసలరాజు దూతలను ఏదోవిధంగా మోసం చేసి పంపాలి అని నిశ్చయించుకొని వారు వ్యూహం పన్నారు.

ఆ రోజున మహానామ భోజనానికి కూర్చున్నాడు. కొంచెం ఎడంగా దూతలు కూర్చున్నారు. మహానాముడు ఒక దాసీని పిలిచి 'అమ్మాయిని తీసుకురా, నాతోపాటు భోజనం చేస్తుంది' అన్నాడు. నిమిషంలో వాసవ వచ్చి, తండ్రితోపాటు ఆయన కంచం ముందే కూర్చుంది. మహానాముడు ఒక ముద్ద నోటిలో పెట్టుకున్నాడు. వాసవక్షత్రియ కూడా ఆయన కంచంలో చెయ్యిపెట్టింది. రెండోముద్ద తీయబోతున్నాడు.

ఇంతలో ఒక భటుడు వచ్చి ఒక ఉత్తరం చూపించి 'ప్రభూ! అవంతిరాజుగారు ఈ ఉత్తరం పంపారు. ఉన్నపాటున సమాధానం తెమ్మన్నారు' అని చెప్పాడు.




మహానాముడి కుడిచెయ్యి కంచంలోనే వుంది. ఎడంచేతితో ఉత్తరంతీసి చదువుతూ 'నువ్వు తింటూవుండు అమ్మా' అన్నాడు. వాసవ తింటూవుంది. ఆతను అతి శ్రద్ధతో ఉత్తరం చదువుతూనే వున్నాడు. కూతురి భోజనం కాగానే, తండ్రీ కూతురూ లేచి చేతులు కడుక్కున్నారు.

కోసలరాజు దూతలు ఇందులో ఉన్న కిటుకు తెలుసుకోలేకపోయారు. వాసవ ఆ మహానాముడి స్వంతకూతురే అనినమ్మారు. శాక్యులు చాలా సంతోషించారు. మహానాముడు ఎంతో వైభవంగా కుమార్తెను కోసలకు పంపించాడు.








చివరకు ఆమె కొడుకు ప్రయాణానికి ఒప్పుకుంటూ, రహస్యంగా తన తండ్రికి వక జాబు వ్రాసింది—'నీ మనమడు కపిల వస్తుకు వస్తున్నాడు. వాడికి ఈ రహస్యం తెలియనీయకుండా వుంచండి' అని.

విరూఢవుడు వస్తున్నాడని తెలియగానే నగరంలోని శాక్యులు వారి పిల్లలందరినీ దగ్గర దగ్గర పల్లెటూళ్లకు పంపించివేశారు. ఎందుచేతనంటే, దాసీపుత్రుడైన విరూఢ వుడికి, శాక్యులెవ్వరూ నమస్కారం చేయ రాదని వాళ్ళ పట్టుదల.

విరూఢవుడు కపిలవస్తునగరం చేరు కొన్నాడు. అతనికి స్వాగతం ఇవ్వటానికి శాక్యులంతా సభచేశారు. అక్కడ అందరినీ వరుసగా రాజకుమారునికి పరిచయం చేశారు. విరూఢవుడు ఒక్కొక్కరికే నమస్కరించాడు. కాని, శాక్యులలో ఒక్కరూ అతనికి తిరిగి నమస్కరించ లేదు. విరూఢవుడికి యిదంతా ఆశ్చర్యం గానేవుంది. అతనికి శాక్యులు జాగ్రత్తగా విడిదీ, భోజనాలు ఏర్పాటుచేశారు.

కొన్నాళ్ళుండి, విరూఢవుడు మళ్ళీ తన నగరానికి బయలుదేరాడు. అతని సైనికులలో ఒకడు విడిదిలో ఏదో వస్తువు మరచిపోయి, మళ్ళీ వెనక్కి వెళ్ళాడు.

కోసలరాజు సంతోషించి వాసవను పట్టపు రాణిగా చేసుకొన్నాడు. కొన్నాళ్ళకు వాసవ క్షత్రియకు చక్కని పిల్లవాడు పుట్టాడు. వానికి 'విరూఢవుడు' అని పేరు పెట్టారు.

విరూఢవుడు పెరిగి పెద్దవాడయ్యాడు. ఒకనాడు తల్లివద్దకు వెళ్ళి 'అమ్మా!— పిల్లలందరూ వాళ్ళ తాతగారింటికి వెళ్ళు తున్నారు. నేనూ మా తాతగారింటికి వెళ్ళి వస్తాను' అని సరదాపడ్డాడు. ఈ మాట వినేసరికి వాసవ క్షత్రియకు నెత్తిన పిడుగు పడినట్టయింది. వద్దని ఎన్నోవిధాల చెప్పి చూచింది. కాని, వద్దన్నకొద్దీ విరూఢవుడికి పట్టుదల ఎక్కువయింది.



అక్కడ ఒక అద్భుతమైన దృశ్యం అతని కంటబడింది—విరూఢవుడు కూర్చుని వదలిన స్థలాన్ని ఒక దాసీది పాలతో కడిగి శుద్ధిచేస్తున్నది. పైగా, గొణుగుతున్నది.

సైనికుడు ఆమెనుండి అసలు విషయం తెలుసుకొన్నాడు. ఈ మాట తోడి సైనికులతో చెప్పాడు. కల్లోలం ప్రారంభమయింది. పోయి పోయి, ఈ సంగతి విరూఢవుని చెవిని పడింది. అతనికి విపరీతమైన కోపం వచ్చింది. 'నేను కూర్చున్న ఆ స్థలాన్ని పాలతో కడిగి శుద్ధిచేశారు శాక్యులు. ఇది చాలదు. నేను రాజునై, ఆ స్థలాన్ని శాక్యుల కంఠరక్తంతో శుద్ధిచేస్తాను. అప్పుడుకాని అది పవిత్రం కాదు...' అని ప్రతిజ్ఞ చేశాడు.

విరూఢవుడు కోసలరాజ్యం చేరుకోగానే ఈ మాయ అంతా ప్రసేనజిత్తుకు తెలిసింది. అతనూ ఉగ్రుడయ్యాడు. కాని, తనకు గురుదేవుడైన బుద్ధభగవానునికి అపచారం చేసినట్టు అవుతుందనే వుద్దేశంతో శాక్యులకు హానిచేయవద్దన్నాడు కొడుకుతో.

అయితే, విరూఢవుడు తండ్రికి ఎదురు తిరిగాడు. కోసలరాజ్య సింహాసనం అలంకరించాడు. తను రాజు కాగానే ముందు శాక్యకులాన్ని నాశనంచేయాలని సంకల్పించుకొన్నాడు. తల్లి ఐన వాసవక్షత్రియ కళ్ళ నీళ్ళతో బతిమలాడింది వద్దని. కాని, అతని మనసు మారలేదు.

పెద్ద సైన్యంతో తరలివెళ్ళి, శాక్యులను ఎదిరించాడు. వారు ఈ దాడికి నిలవలేక పోయారు. ఏ కోశానా దయ జాలి అనేది లేకుండా, విరూఢవుడు శాక్యులందరినీ నరికివేసి, రక్తం ప్రవహింపజేశాడు.

ఆ నెత్తురుతో తను శాక్యరాజ్యంలో ఇదివరకు కూర్చున్న స్థలాన్ని కడిగివేశాడు. ఈవిధంగా విరూఢవుడు తన పగ తీర్చుకొన్నాడు. శాక్యకులం, శాక్యరాజ్యం సర్వనాశనమయినై.





# వార్తలు-విశేషాలు

న్యూఢిల్లీలో బాలలకోసం ప్రత్యేకించి చిత్రాలు నిర్మించటానికని ఒక సంఘం స్థాపించబడింది. దీని పేరు 'సంస్కృతీ ప్రచారక చిత్రాల ప్రదర్శన సంఘం'. ఈ సంఘంవారు ఈమధ్యనే చెకోస్లొవాకియా బొమ్మలాటలపైన తీయబడిన ఒక చిత్రాన్ని మన ప్రధానిఐన పండిట్ జవహర్లాల్ నెహ్రూఎదట ప్రదర్శించారు. కొందరు పిల్లలతోపాటు నెహ్రూ ఆ చిత్రాన్ని చూచినతరువాత, ఈ సంఘంవారు నిర్వహిస్తున్న ఉద్యమాన్ని ప్రతి భారతీయుడూ ప్రోత్సహించాలని చెప్పారు. అంతేకాక, ప్రధాని నెహ్రూ ఇష్టాగోష్ఠిలో తన వుద్దేశాన్ని యిలా వెల్లడించారు: 'మహఐతే, నేను సంవత్సరానికి రెండు సినిమాలు చూస్తాను. చౌకబారు సినిమాలు పిల్లలకు తగవని ఘంటాపథంగా చెప్పగలను. విదేశాలలో పిల్లల అభిరుచుల్ని దృష్టిలో పెట్టుకొని, కేవలం వారికోసమే ప్రత్యేక సినిమాలు తీయడం మనం గుర్తుంచుకోవాలి."

*　　　*　　　*　　　*

మధ్యభారత్ రాష్ట్రంలోని 'బిర్లింగ' గ్రామంలో కొందరు విద్యార్థులు స్వయంకృషి—స్వతంత్ర జీవనం అనే సూత్రాన్ని అవలంబించటంలో పాటుపడుతున్నారు. విద్యార్థులే తమ పాఠశాలకోసం ఒక కుటీరాన్ని నిర్మించుకొన్నారు. గ్రామస్థుల సహాయంతో వారే స్వయంగా వసతిగృహాలను నిర్మించుకొన్నారు. వారి కృషీ, ఉత్సాహమూ చూచి దగ్గరవున్న బస్తర్ గ్రామస్థులు చాలవరకు వారికి తోడ్పడుతున్నారు. పోతే, విద్యార్థులకు అవసరమైన పలకలు, పుస్తకాలతోసహా ఉపాధ్యాయుల్నికూడా కమ్యూనిటీప్రాజెక్టు కార్యకర్తలు పంపారు.

*　　　*　　　*　　　*

వచ్చే అక్టోబరులో ఢిల్లీనగరంలో 'ప్రాచీన టపాబిళ్ళల ప్రదర్శనం' జరపటానికి ఏర్పాట్లు జరుగుతున్నవి. ఈ ప్రదర్శనంలో 25 దేశాలకు పైగా పాల్గొంటున్నవి.

*　　　*　　　*　　　*

'ఉడిపి'లోని ఒక మఠానికి ఎదుట 'కోట్యాన్' అనే కుర్రవాడు విరామం లేకుండా 36 గంటలసేపు సైకిలు స్వారీచేసి, బహుమతి పొందాడు. ఇటువంటి పోటీలు ఈమధ్య మదరాసునగరంలోకూడా జరిగినై.

న్యూఢిల్లీలో గల బేసిక్ పాఠశాలలో 7 సీనియర్ స్కాలర్‌షిప్పులు, 22 జూనియర్ స్కాలర్‌షిప్పులు ఏర్పాటుచేయబడ్డాయి. శిక్షణకు చెల్లించవలసిన రుసుము, భోజన వసతుల ఖర్చులు, స్కాలర్‌షిప్పులివ్వబడినవారికి ప్రభుత్వమే భరిస్తుంది. షెడ్యూలు తరగతులు, షెడ్యూల్ జాతులు, వెనుకబడ్డ జాతులవారికోసం 1954-55 సంవత్సరంలో ఈ స్కాలర్‌షిప్పుల స్కీముకింద 75 లక్షల రూపాయలు కేటాయించబడ్డాయి.

*　　*　　*　　*

ఈ ఏడు అక్టోబరు 25 నుండి నవంబరు 8 వరకు బాగ్దాద్‌లో జరుగనున్న బ్రిటిషువర్తక ప్రదర్శనంలో కొత్తరకపు శాశ్వతమైన అల్యూమినియం భవనం ఒకటి ప్రదర్శింపబడనున్నది. ఇది సమస్తమైన సాధన సంపత్తిగల ఒక స్కూలుభవనం. బ్రిటన్ వివిధ ప్రాంతాలలో ఇటువంటివి 400 అల్యూమినియం స్కూలుభవనాలు ఏర్పాటుచేయబడినై. 600 కు పైగా ఆస్ట్రేలియా, న్యూజిలెండు దేశాలకు ఎగుమతికూడా చేయబడినై.

*　　*　　*　　*

'ఇజ్రాయలీ' పిల్లలకు ప్రధాని నెహ్రూ ఒక ఏడాది ప్రాయం గల పులిపిల్లను కానుకగా సమర్పించారు. దీనిపేరు 'వింధ్యాపని'. ఇది వింధ్యప్రదేశ్ అడవులలో దొరికింది.

*　　*　　*　　*

టాస్మేనియాదేశపు అడవులలో భయంకరమైన ఒకజాతి తోడేలున్నది. ఇది చాలా అపరూపమయింది. మగది కుక్కను పోలి ఉంటుందనీ, ఆడతోడేలు 'కంగారూ'వలె ఉంటుందనీ ఈ తోడేళ్లను పట్టే బ్రిటిషు వేటగాండ్రు చెబుతున్నారు. ఇది ఒకేసారి మేకలనూ గొర్రెలనూ లెక్కలేనన్ని దొంగిలిస్తుందనీ, అందుచేత అడవులలోపలికంటా తరిమివేయబడిందనీ అంటున్నారు. ఐతే, సుమారు 20 సంవత్సరాలనుండి దీని స్వరూపం కనబడకపోవటంచేత, ఒకవేళ ఈ తోడేలుజాతి నశించేపోయిందేమోనని వేటగాండ్రు ఊహిస్తున్నారు.

*　　*　　*　　*

ఈ సంవత్సరం ఏప్రిల్ 19-వ తేదీన 'జాతీయప్రణాళిక ఋణం' అనే ఒక కొత్త ఏర్పాటును మన ప్రభుత్వంవారు ప్రారంభించారు. ఈ ఋణానికి ఇప్పటివరకు వసూలైన విరాళాలు రు. 80,56,00.000 లు. ఒక్క మే నెలలోనే దాదాపు రు. 23,30,00,000 లు చెల్లించబడింది.

*　　*　　*　　*

'చెకోస్లావాకియా' వ్యాయామ ప్రవీణుడు ఎమిల్ జటొపెక్ అనే ఆయన ఇంతవరకు 9 ప్రపంచ రికార్డులు స్థాపించి, ఇప్పుడు 10,000 మీటర్ల పరుగులో తన రికార్డునే తను అధిగమించాడు. సుమారు 6 మైళ్ళు గల ఈ దూరాన్ని ఆయన 28 నిమిషాల 54 2 సెకన్లలో పరుగెత్తాడు.

# చిత్రకథ



ఆరోజు ఆదివారం. దాసు, వాసు షికారువెళ్ళారు. ఒకచోట కూర్చున్నారు. దాసు అన్నాడు–"ఒరే వాసూ! యీ రొట్టె ఎవరుకొంటే వీంగాని, ఒక పందెం వేద్దాం. అకనబడే మైలురాతిమీద దీన్నిపెట్టి–ఆ చెట్టుదగ్గిరనుంచి పరిగెత్తుదాం. ముందెవరు అందుకుంటే వాళ్ళది ఈ రొట్టె." "సరే" అన్నాడు వాసు.




ఇంకేం, మైలురాతిమీద రొట్టెనుపెట్టి ఆ చెట్టుదగ్గిరనుంచి పరిగెత్త సాగారు. వాళ్ళ పెంపుడుకుక్క 'టైగర్'కు వీళ్ళ పందెంసంగతి తెలీదుగాని, ఆకలవుతున్నట్టు మాత్రం గ్రహించింది. ఇక పరుగుచ్చుకుని దాసూ, వాసూల కంటె ముందు పరిగెత్తి ఆ రొట్టెను కాస్తా నోటకరుచుకుని దూరంగా పారిపోయింది. పాపం, దాసూ, వాసూ......

**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'**

Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

మింటి కెగురు

పంపినవారు :
ఎన్. విజయలక్ష్మి - ఏలూరు




రత్నగోళం - 3